శ్రీరస్తు.

శ్రీశివాభ్యాం నమః.

# భోగేశ్వర మాహాత్మ్యము.

ఇది

బందరు తాలూకాలో పెడన గ్రామంబున నివసించు

మల్లంపల్లి మల్లికార్జునారాధ్యునిచే

రచియింపఁబడి

వారి ప్రియశిష్య శిఖామణులగు శ్రీ శ్రీ దారా

సూర్యప్రకాశలింగ చంద్రశేఖరస్వాముల

ద్రవ్యసాహాయ్యమున

శ్రీభైరవముద్రాక్షశాల యందు ముద్రించి

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 2000 కాపీలు.

మచిలీబందరు.

వెల రు 0-8-0



దారా లింగయ్యగారి సూర్యప్రకాశలింగంగారు.

## కథా సూచకము.

మ॥ శ్రీశైలంబున కేగువేళ గొడగూచిం గేహమం దుండి భో
గేశుం గొల్వ విధించి యేగి తుదిఁ దామే తెంచి పాల్వండ్లు భో
గేశుం డే కొనె నన్న నమ్మక సుతన్ హింసింపఁ బోఁ దండ్రికిం
దాఁ శీఘ్రమ్మున నడ్డుపడ్డ శివుఁ డత్యంతంబు మెచ్చెన్ముతన్.

## కృతిపోషకవంశానుక్రమణిక.

సీ॥ శ్రీవిష్ణునాభికుశేశయంబునఁ బుట్టె, నజుడు దదూరువునందు నూట,
యిరువురుజన్మించిరిద్ధయశులు వైశ్యమును లందుమాద్గల్యముని పవిత్ర
గోత్రమందున ననఘులు ననేకులు పుణ్య పురుషులు వొడమిరా
పురుషుల నొక, ఘనునకు దారాఖ్య గలిగెను దదభిఖ్య నొప్పుతద్వం
శమం దుదయమందె.

తే॥ గీ॥ రాజలింగాభిధానుఁడా రాజలింగ
మునకుఁ బుట్టిరి మల్లయ్యయును నమశ్శి
వాయయును శైవమతసంప్రదాయవిదులు
దానశౌండులు ధనులు సోదరులు ఘనులు. ౧

గీ॥ వారిలోన నొకనమశ్శివాయ కుద్భ
వించెఁ గొమరుండు సుబ్బయ్య పేరవంశ
వర్ధనుండు ఘనుఁడు సత్ప్రవర్తనుండు
నలువు రయ్యనఘున కాత్మజులు వొడమిరి. ౨

సీ॥ వారిలోఁ బెద్దయై వంశరత్నంబౌచుఁ బట్టయ్యవసుధలో వన్నెకెక్కెఁ,
దాతమల్లయ్యకు దత్తపుత్రుం డౌచు నక్షయలింగంబు ననువు
మీఱె, రాజలింగము మహారాజలింగంబని ప్రజలెల్ల వినుతింపఁ
బ్రథ నెసంగె, గురుచరేశ్వరపాదసరసిజభ్రమరమై దాతయై లింగ
య్య తాఁ జెలంగె;

గీ॥ దత్తుఁ డక్షయలింగంబు దనయుఁ గాంచి
తండ్రిమల్లయ్య పేరిడెఁ దనుభవునకు

సతనిసతిమహాలక్ష్మిపుణ్యాత్మురాలు
విశ్వనాథుండు కొమరుండు విదితుఁడతఁడు. ౩

సీ॥ జగ్గయ్యపేటలోఁజంద్రిమాళీశ్వరస్వామివారికిఁ దూర్పు భాగమందు
విశ్వేశ్వరస్వామిపేరఁ గాశీలింగమును బ్రతిష్ఠించిన పుణ్యమూర్తి
యాప్రతిష్ఠకు వచ్చినట్టిభూసురులకుఁ బదివేలు పంచిన పరమదాత
దీకొని పోరి గౌరీకాహాళములను శివునకు నిల్పినచేవకాఁడు;
తే॥ గీ॥ సతతషట్కాల శివసమర్చాపరుండు
సత్యసంధుండు గురుచరార్చారతుండు
రోహిలాలకుఁ జంకనిసాహసికుఁడు
సభినుతింపంగ వశమె? మల్లయ్యగరిను. ౪

ఉ॥ అర్యకులైకభూషణుఁ డనర్ఘగుణోజ్జ్వలుఁ డైన రాజలిం
గార్యుఁడు రాజపట్టణమునందలిసత్రము సాగునట్టు లా
సూర్యశశాంక ముండెడి వసుంధర లిచ్చి స్వకీయమైన యౌ
దార్యము లోకమెల్ల బహుధా వినుతింపఁగ నొప్పె నెంతయున్. ౫

సీ॥ రాజలింగాభిధునకుఁ దనూజు లైరి
ఘనులు పట్టయ్య సుబ్బయ్యయును నసఘులు
నందుఁ బట్టయ్య చిన్నసుబ్బయ్యను గనె
సూర్యనారాయణుం గనె సుబ్బయయును. ౬

కం॥ లింగయ్యసుగుణసంప, త్తిం గొనియాడంగ నెట్టిధీమంతులకై
నం గానివశమె?పుణ్యమ,నంగా సతనిదియె యట్టిమానవుఁడున్నే. ౭

గీ॥ లింగయార్యుండు సతియై వెలుంగుచున్న
గొల్లపూడి వేంకటరాము కూర్మి కూఁతు
రైనవేంకటరత్నాంబయందుఁ గాంచెఁ
దనుభవాత్రితయంబు సుతద్వయంబు. ౮

సీ॥ విఖ్యాతసుగుణౌఘ వేంకటరత్నాంబ రాజత్కృపాపూర రాజ్యల
క్ష్మిన, ఘనకీర్తిసూర్యప్రకాశలింగము సతీరత్నంబు వేంకటరత్న
మనఘ,సతతస్వహృద్వాసిచంద్రశేఖరుఁడలచంద్రశేఖరుఁడు నిస్తం

ద్రిబుద్ధి,యగుచుఁ జెన్నారుదు రందు సూర్యప్రకాశంబునకుఁబ్రథ
మజాయయాల;

గీ॥ పాటిలక్ష్మీపతితనూజ పరమసాధ్వి
రాజ్యలక్ష్మి రెండవభార్య రాజ్యలక్ష్మి
ప్రథిత శ్రీరామకులజ యప్పన్నపుత్రి
యం దతఁడు గాంచె నిరువుర నాత్మజలను. ౯

గీ॥ రాజ్యరత్నమ్మ వీరభద్రమ యనియును
నలరుదురు వారు రాజ్యరత్నమ్మ ధర్త్ర
వరపుసన్న్యాసిదేవు కృపం గుమారుఁ
గాంచె సన్న్యాసిరాజాఖ్యఁ గన నతండు. ౧౦

గీ॥ వీరభద్రమ్మ వేంకటసూరసత్య
పార్వతిని గనెనక్క-న్నె బందరుపురిఁ
దనరు మాజేటి సోమసుందరునికొమరుఁ
డైన బాపన్న రావున కయ్యెఁబత్ని. ౧౧

గీ॥ ఆయమకు హనుమద్వేంకటార్యమప్ర
కాశరావ నుజన్మఁడై కలిగి కరము
తల్లితలిదండ్రులకుఁ దనతల్లిదండ్రు
లకు ముదంబిడి మిగులఁజెలంగుచుండు. ౧౨

తే॥ గీ॥ చంద్రశేఖరునకుఁ బెద్దజాయ యయ్యె
గొల్లపూడి జగన్నాయకుల తనూజ
సద్గుణాఢ్య పార్వత్యంబ సాధ్వియందు
నతఁడు గనె హనుమల్లింగమనుతనూజు. ౧౩

తే॥ గీ॥ చిన్నభార్యయై యలరు మాజేటి వంశ
రత్నము మునయ్యసుత మంగరాజు సాధ్వి
వడసె చంద్రశేఖర వీరభద్రరావు
ననఘు నీశ్వరరావుని 'నతనివలన. ౧౪

తే॥ గీ॥ వారిలోఁ జంద్రశేఖరవీరభద్ర
రావుపెదతండ్రి యైనసూర్యప్రకాశ

లింగమునకు దత్తుండై చెలంగు నెల్ల
వారు దనసుగుణములను బ్రస్తుతింప. ౧౫

ఉ॥ తాతకు దత్తుడైన పెదతండ్రికిఁ బుత్రుడు వీరికాతఁ డా
సేతుహిమాచలాంతము బ్రసిద్ధి వహించిన మల్లయార్యుఁ డా
రీతియె వీరి యందును స్ఫురించును వీ రొనరించు సత్క్రియా
జాతముఁ బట్టి సూర్యుఁడనఁ జంద్రుఁడునా నొకపాటి వారలే? ౧౬

సీ॥ జగ్గయ్యపేటవాసం బాతనికి వీరి యావాసమెన్న జగ్గమ్మపేట, చంద్ర
మౌళీశుండు జంద్రశేఖరదేవుఁ డాపేట నీపేట నలరుచుందు, రా
యాలయంబులో నాతండు విశ్వేశు నీయాలయమున వీరిభవరాస్య
సర్వకామదఁ బ్రతిష్ఠం జేసిర తఁడటఁ గావించె మఱియు సత్కార్య
ములిట.

తే॥ గీ॥ వాహనంబుల కొట్టును వాహనములు
వీధిడాబాయుఁ బ్రహరియుఁ బెద్దరథము
మంటపములఁ గట్టించి యామల్లయార్యుఁ
బోలి రీసూర్యచంద్రులు పుణ్యధనులు. ౧౭

సీ॥ జగ్గమ్మపేటలో స్వాముల కెల్లప్పుడు ను రాగభోగంబులును మ
హోత్సవంబులు భృగుసోమవారసేవలు నఖండంబు నిరంతరా
యంబు గాగ, జరుగఁగాఁ దగిన వసతుల నేర్పఱచిరి విజయనగర
మందు వెలయునయ్య, కోనేటితూర్పుదిక్కున వెలసిన యంజనా
త్మజు దేవాలయంబు చుట్టు;

తే॥ గీ॥ మంటపంబును గట్టించి మఱియునందుఁ
బంచముఖపావనిం బ్రతిష్ఠించి రుత్స
వార్థముగఁ బ్రతివత్సర మచటియాంజ
నేయుకల్యాణమహము వర్ణింప దరమె. ౧౮

గీ॥ మఱియు వడుగులుఁ బెండ్లిండ్లు మంచినీళ్ల
నూతులని దోఁటలని వేరె నుడువనేల
ఘనులు సూర్యప్రకాశములింగమును చంద్ర
శేఖరుఁడు నెఱపని మంచిపైవు లున్నె? ౧౯

ఉ॥ సూర్యుఁడు సూర్యుఁడే తదనుజుండగు చంద్రుఁడు చంద్రుఁడే సమ
స్తార్యజనాభినంద్యగుణులై చెలువొందుట యందు సుస్థిరై
శ్వర్యమునందు నాశ్రితుల సాకుటయందును బేర్మియందు నౌ
దార్యమునందు ధర్మపరతంత్రతయందును గీర్తియందునున్. ౨౦

ఉ॥ వీరలుమాకుశిష్యులని పేర్మిని గొప్పలు చెప్పుచుంటినం
చారయఁ బోకుఁడీ! బుధుల నాదిగ వీరికిఁ గీర్తిచిహ్నమై
పేరు వహించు డప్పు విను వీధిఁ బ్రతిధ్వని పుట్టునట్టు లు
చ్చైరవ మాచు వీరిగుణ సంపద లెల్లను జాటుచుండెడున్. ౨౦

వ॥ బందరునకువచ్చినపుడు.

ఉ॥ వీరొ కమాఱు బందుగుల వెంబడిఁ బెట్టుక పేర్మిమీఱమా
యూరికిఁ దూర్పునం బెరుఁగుచున్న రసాలవనంబునందుఁ జె
న్నారెడి యంటుమామిడులయంట్లఁగొనంగనవచ్చి దేశికా
గారములం గనుంగొనుటకై మది కౌతుక ముప్పతిల్లినన్. ౨౨

సీ॥ మాయిండ్లకును వచ్చి మాకు సంతోషంబు గూర్చుచుఁ గూర్చుండి
కొంతసేపు, కుశలంబు లడిగి స్వకుశలంబులనుజెప్పి నావలన విజయ
నగరమందు, మున్నొకపరి గొంతవిన్నట్టియునుముందుఁ బ్రకటింపఁ
బడు వాని వంటిపత్రి, కారత్నముల ననేకముల వ్రాసిన కందు
కూరి శ్రీగిరిపతిప్రేరణంబు;
తే॥ గీ॥ వలన నాచేత నొనరింపఁబడిన భోగ
నాథమాహాత్మ్యమను ప్రబంధంబునందు
శేషమును దాము వినిసంతసించి మఱియు
నామనోరథమునకు నానంద మంది.

చ॥ గురువులు మీరు మీకుఁ గల కోరికయుంగడు మాననీయమై
పరఁగెడి నిట్టి కోరిక నవశ్యముగా నెఱవేర్పమాకు సం
బరమగు చున్నదింకఁ దగుపండిత కోటికిఁ జూపుఁడయ్య స
త్వరముగనచ్చుకూర్పునకు ద్రవ్యము నిత్తుము మీకునావుడున్

సీ॥ మేమండఱ మపరిమిత పరితోషంబు చెంది దీవన లిడఁ జెలఁగి పేర్మి
తనరవారేగి నేను చండితాగ్రేసరులకుఁ జూపించి వారలకుఁ
దెలియఁజేసి సఁగావలసిన సొమ్ము నొసఁగిరి మునుమున్ను ద్విసహస్ర
పుస్తకములు, కూర్పఁబడిన వందుఁ గొన్ని వారికి నాకుఁ గొన్ని మొత్త
ము నాలుగు శతములును గీ॥ గాక షోడశశత పుస్తకముల సొమ్ము
మా యగస్త్యేశునిది వృద్ధిమాత్రి మర్థ, భాగమును గొందు మొ
క కొంతవఱకు దానిఁ, గొనెడివారిదె తుది విడిచిన ఫలంబు, ౨౫

గీ॥ నువ్వుగింజ సామెతఁ బోలి నవ్వఁ దగిన
యట్లు నేను ముందుగా నిట్లు వ్రాయ
వలసివచ్చెను దెలుపుఁ వదలకుండ
నడుమ వచ్చును గదయును నమ్మకమున. ౨౬

క॥ కృతిపోషకులగు వారికి, కృతికర్తల మైనమాకుఁ గృతిపతు లొకరై
సతతము సకలాభీష్టార్థతతులు నొడఁగూర్చి ప్రోవుత న్నడుఁ బేర్మిన్.



మహారాజశ్రీ కందుకూరి శ్రీశైలపతి బి. ఏ., గారు వ్రాసిన యుత్తరములు.

ఏలూరు శ్రావణ శు ౧

చ॥ కుశలమె? మీకు బంధుగులకు న్సఖులందఱికిం దలం తహ
ర్నిశమును మిమ్ము నామదిని నిక్కము దానికిఁ గారణంబు నా
వశమె వచింప మీమధుర వాణియె కాఁదగునంచు నెంచెదన్
భృశము బుధుండు భూపతిని నెచ్చటఁ బూజ్యుఁడు గాఁడొ చెప్పుమా.
సీ॥ నాదు పద్యంబులను జూచి సన్నుతుల్, శక్తి కొలఁదిని విద్యాను రక్తిచేత
వ్రాతునే కాని యున్నదే పాటవంబు, గాజు తానెంత మెఱసినఁ గనకమౌనె.
శా॥ ఆచంద్రార్కము గీర్తిఁ గూర్చునది కావ్యంబే కదా భావ? నీ
వాచాధీరతఁ జూపి యొక్క కృతి విద్వద్బృంద హృద్యంబుగా
నీచిత్తానుమతంబుగా శివునిపై నిర్మించితేనిం ధరి
శ్రీచక్రంబున దీప్తిఁ జెందునది ముద్రింపింతు నే మిత్రమా.
గీ॥ మిమ్ముఁ బొగడిన మాత్రాన సొమ్ము రాదు, మణిని మణియన్న దోసమే గుణధురీణ
తప్పులన్నియు మన్నించి తమరు వేగ, జాబు వ్రాసిన నేఁగడు సంతసింతు.

---

ఆ॥ వె॥ తాళ్లరేవునుండి తమరు వ్రాసిన జాబు, జూచి మోదవార్ధి వీచికలను
నోలలాడుచుంటి నో బావ! యాసదా, శివుని కరుణ మాకు సేమమిచట.
ఉ॥ పట్టపరీక్షలో శివుకృపం గృతకృత్యుఁడ నైతిఁ గాని యి
వ్వట్టున లాఁ బఠించుటకు బాధలచేతను నాకుఁ బూర్వపుం
బట్టు కరంబు తగ్గుటను బట్టి పఠింపక నుంటిఁ గానిచో
ట్టులె యూరకుండునె మహేశుని వ్రాఁతయలంఘ్య మేరికిన్.
శా॥ లోకారాధ్యుఁడ మల్లికార్జునుఁడ! యాలోచింపఁగానీ వకా
యాకారుణ్యపయోనిధాన మగు నుద్యచ్ఛంకరాకారమై
మాకుం దోఁచితి మీదయాపరత సన్మార్గంబు చేకూరెఁ బో?
లోకంబందునఁ గీర్తిఁ గాంచితిమి సుశ్లోకుండ వీవెంతయున్.
గీ॥ క్రొత్త పద్దెములేమైనఁ గొన్ని వ్రాసి, నారచి గ్రంథము వేగమె మీరు పూర్తి
చేసి పంపిన దానినే శీఘ్రకాల, మున నే యచ్చువేయింతును ముదముతోడ.

ఏలూరు, }
2-4-06. }

కందుకూరి శ్రీశైలపతి.

---

ఉ॥ సేమమె మీకు బిడ్డకును జేడియ కమ్మకు బంధుకోటికిన్
నామనసెప్పుడెల్ల పెదనన్మన విందులపైనె యుండు నన్
బాముల నేల బెట్టెదొ జవాబును వేగమె వ్రాయకున్న నా
కేమియుఁ దోఁచదయ్య నృపతీంద్రపురస్థున మాకు సేమమే.

ఉ॥ వీరయశాస్త్రి గారును గవిపృవరుల్మఱి కొందఱేను రం
భారమ లన్న ద్వంద్వపు సమాసము సాధువె యంచుఁ బల్కఁగా
వారలుగాదు కాదనుచుఁ బల్కిరి కావున దానివేగమే
మీరలు మార్పఁడీకలుగు మేలటు చేసిన మీకు మిత్రమా.
సీ॥ ఘనులును సరసులునుమీరె కాని యెడల, రసమునకు మీరలేరీతి వసతులైరి
వజ్రమునకు వెలుఁగు స్వభావంబుగాదె, కవిజనానందకరరసకవననిపుణ
చ॥ కవియను పేరు మీకుఁనగుఁ గల్పనఁజేసిన వారలందఱుఁ
గవులె! స్వభావసిద్ధమగు కల్పనఁ జేసిన మానవుండు యీ
యవనిఁ బ్రశస్తిఁగాంచు బుధులందఱు వానిని మెచ్చుకొందుర
య్య వినుతికెక్కఁ నీకృతి వయస్య! వసుంధరయందు నమ్ముమీ.
చ॥ పొగడుచు నుంటినంచుఁ దలపోయకు మోసలికాఁడ? యూరకే
పొగడిన లాభమేమి రసపూర్ణము నీకవనంబు నూన మి
జ్జగతి బ్రశస్తిఁ గాంచు రవిచంద్రులు దారలునుండు దనకఁ మే
లగణితకీర్తి వైభవము నార్జనఁజేసితి వయ్య! మిత్రమా.
సీ॥ తప్పులను మీరుచేయుదు రొప్పులనుచు, నెంచివ్రాసితి నీజాబు నేమినేంత
నున్న వారలా మీరు నేనూహఁజేయ, జాల మామక ప్రియమిత్ర సచ్చరిత్ర.

రాజమహేంద్రవరం.
16-2-07.

K. SRFESAILAPATI.

---

శ్లో॥ వదనం సదనం త్రివిష్టపాంజనే స్సుదతీ యస్యతు సర్వమంగళా
సదదాతునదా సదాశివో మృదుతాం తేవచ సాంచ మాధురీం.
శా॥ క్షేమంభావ మహానుభావ భవతాం భార్యాభగిన్యోరపి
కన్యాయాశ్చ భిషగ్వరోపి కుశలీ శ్రీనాగలింగాహ్వయః
క్షేమంసోమకలాకలాపకృపయా భూపేంద్రపుర్యాం మమ
బంధూనా మపికీదృశం తవ మహాకావ్యం విశేషాశ్చకే.
మ॥ అవకాశం బొకయింతలే దయిన వ్రాయంబూనితిం బద్దెముల్
భవుపేర్మిన్మఱి గొన్నినాళ్లిటులె యభ్యాసంబుఁ జేయంగవా
ణి వశంబౌఁ దమకైనరీతినను భావింతిన్మిరునన్నుఁ క్షమిం
పవలెన్ దీనుని నాకుదారియును జూపంగా వలెన్మిత్రమా.
క॥ ఒడలెఱుఁగక వ్రాయంగాఁ, బొడఁగితిఁబద్దెంబులఁగడు తొందరపడిసే
చెడుగునుడుగుపాలంబడ, వడిఁగట్టితిఁ గావు మయ్య! వ్యర్థుని నన్నుఁ.

రాజమహేంద్రవరం.
6-7-07

K. SREESAILAPATI.

# విషయసూచిక.


| పుట. | పద్య. | మొదలు. | విషయములు. |
|---|---|---|---|
| ఆశ్వా 1 | | | |
| 8 | 42 | ,, | పురవర్ణనము |
| 10 | 59 | ,, | శివదేవుని వర్ణనము |
| 11 | 72 | ,, | సర్వమంగళా వర్ణనము |
| 13 | 83 | ,, | వివాహవర్ణనము |
| 15 | 98 | ,, | చక్షుఃప్రీతి వర్ణనము |
| ఆశ్వా 2 | | | |
| 21 | 3 | ,, | వసంతఋతు వర్ణనము |
| 22 | 13 | ,, | స్త్రీవర్ణనము |
| 25 | 31 | ,, | మనస్సంగాద్యవస్థావర్ణనము |
| 27 | 44 | ,, | శివదేవుఁడపత్యలాభంబుచే భార్యతోఁజింతిలుట. |
| 27 | 49 | ,, | మునివర్ణనము |
| 28 | 56 | ,, | ముని శివదేవునూరార్చుట. |
| 29 | 62 | ,, | దౌహృదవర్ణనము |
| ఆశ్వా 3 | | | |
| 32 | 3 | ,, | గౌడగూచి వర్ణనము [దుమనుట.] |
| 33 | 15 | ,, | తలిదండ్రులుగౌడగూచితోఁ శ్రీశైలంబున కరుగు |
| 34 | 21 | ,, | గౌడగూచి శ్రీగిరికిఁ దలిదండ్రులు తన్నురావల నుపడదనుటచేఁ జింతిలుట. |
| 35 | 27 | ,, | తలిదండ్రులు శివపూజావిషయరహస్యముల గౌడగూచి కుపదేశించుట |
| 38 | 45 | ,, | సూర్యాస్తమయాదివర్ణనము |
| 40 | 58 | ,, | గౌడగూచి, భోగేశుఁబూజించుటమొదలగు విషయములు |
| 46 | 100 | ,, | భగవత్సాక్షాత్కారము |
| ఆశ్వా 4 | | | |
| 50 | 10 | ,, | శివదేవుఁడు శ్రీశైలేశుతో స్వవృత్తంబు విన్నవించుకొనుట |
| 51 | 22 | ,, | శివదేవుండు సతీసుతలకు శ్రీశైల మహిమల నుడువుట |
| 58 | 65 | ,, | శుక్రోదయాది వర్ణనము |
| 59 | 73 | ,, | పాతాళగంగావర్ణనము |

| | | | |
|---|---|---|---|
| 60 | 86 | ,, | శ్రీశైలోత్పత్త్యాదికథనము |
| 62 | 100 | ,, | పర్వతుండు శ్రీపర్వతుండగుట |
| 63 | 103 | ,, | పర్వతలింగమునకు మల్లికార్జునాఖ్యకలుగుట |
| 63 | 109 | ,, | సూర్యాస్తమయాది వర్ణనము |
| 65 | 118 | ,, | పూర్ణసోమోపాలంభనము |
| 67 | 131 | ,, | పార్వతికి భ్రమరాంబాఖ్యవచ్చుట |
| 68 | 142 | ,, | క్షీణసోమోదయ వర్ణనము |
| 69 | 143 | ,, | సూర్యోదయవర్ణనము |
| ఆశ్వా 5 | | | |
| 73 | 18 | ,, | మునిగుదగోయ్యన్నందుకు శివదేవుండు మునూని కం గోపించుట |
| 74 | 27 | ,, | గొడగూచి పశ్చాత్తాపము నొందుట |
| 75 | 35 | ,, | శివదేవుండు భోగేశుండు పాలనారగించె ననుటకు నాశ్చర్యపడుట |
| 76 | 42 | ,, | గొడగూచిభోగేశు నెట్లుగన్పడఁజేతు నన్నందుకు శివదేవుడు ఆత్మగతంబుగ చింతులుట, కుమారితో భోగేశసాక్షాత్కారము నమ్మననుట లోనగునవి |
| 81 | 79 | ,, | గొడగూచి భోగేశునిగూర్చి ప్రార్థించుట |
| 82 | 85 | ,, | భోగేశసాక్షాత్కారము |


☞ ఈమూడుపద్యములును ద్వితీయాశ్వాసము 29 పుటలో 62 వ పద్యముతుదిని వరుసగాఁ జేర్చుకొనవలయును.

సీ॥ తమకు సంతానకీర్తి మోక్షములు గలుగు। ననుట మునిపద్మబంధుండు జనుట వికస। నమును సంకోచమును దన్మనస్సరోజ। ములను మెలఁగె నాశ్రీమసత్త్వములను మించి॥

సీ॥ దంపతులు వానిమాటలు దప్పకుండ। శ్రీగిరీశుని దమమనస్సీమలందు నిలిపియకలంకభక్తిచేఁ గొలుచుచుండ। నరిగెనొకకొన్ని దినములనంతరమున॥

దౌహృదవర్ణనము.

సీ॥ శ్రీగిరీశు ప్రసాదంబు చెలికిసాంగ। మగుచుఁగననయ్యె ననదుమమ మరె ముందుఁ। గ్రిందుమీఁదును గానక కినుకదాని। రూపుమాపిన కుచకటులోపవిఁకను॥

శుభమస్తు. అవిఘ్నమస్తు.

# భోగేశ్వరమాహాత్మ్యము.

## ప్రథమాశ్వాసము.

శా॥ శ్రీగౌరిం దనయంకపీఠమునఁ బేర్మి న్నిల్పి వక్షోధరా
భోగంబందునఁ జందనం బిడి “చెలీ! భోగ్యావృతిం జెందమిం
బాగానే”యన నవ్వుపార్వతి నభిప్రాయజ్ఞఁగా నెంచు నా
యోగిధ్యేయుఁడు శ్రీగిరీశుఁడు చిరాయుశ్శ్రీలు మాకీవుతన్॥ ౧

ఉ॥ తల్లికి నిర్జరీగణముతల్లికి భూవిజితాత్మభూధను
ర్వల్లికి బాలచంద్రధరు బాహుల పేరిటి మేటిశాఖలం
దల్లిన పుష్పవల్లికి దయారమఁ గాంచినపాలవెల్లికిన్
మొల్లనఁ జేతు లెత్తి ప్రణమిల్లెద నాశ్రితకల్పవల్లికిన్॥ ౨

ఉ॥ శ్రీరుచిరాచిరప్రభ మశేషజగద్ధృదయంగమంబు గో
త్రారసమూల ముద్ధృతపరాగము బద్ధగిరీశసఖ్యముల్
మారజనిప్రయోజకము మంజుఘటద్ఘనభక్తకేకి చె
న్నారెడు కృష్ణమేఘము దయారసవృష్టుల మమ్ముఁ బ్రోవుతన్॥ ౩

ఉ॥ అంగజుఁ గన్నతల్లి కమలాక్షునిపట్టపుదేవి పద్మగ
ర్భాంగన కత్తగారును బయోబ్ధికి గాదిలిముద్దుబిడ్డ మా
కుంగలయండ చందురునకుం దగుతోడు దయానిధాన మా
మంగళదేవతం గొలుతు మాకు నొసంగుత నాపె సంపదల్. ౪

చ॥ పలుకఁ వెలంది పున్నెములపంట జగమ్ములు చేయుదంట ప్రాఁ
బలుకులకుంగొటారు తెలిపక్కి హుమాయువజీఋ గట్టినె
చ్చెలికిని లచ్చి కాత్మజుఁడు జిల్కవజీఋన కగ్రజుండు నా
సలువ ప్రశస్తకల్పనల నైపుణి నీవుత నాకు నర్మిలిన్. ౫

ఉ॥ నమ్మి భజింతు నామొగమునం దగురీతి నొయార మొప్పనె
త్తమ్ముల గేరునెమ్మెనుపదమ్ముల నూపురమేఖలానినా

దమ్ములు గుల్క నిండుప్రమదమ్మున బొంగి నటింపవమ్మయో
యమ్మ! దయాపయోధివి కదమ్మ! సుతు న్ననుఁ బ్రోవు భారతీ! ౬.
చ॥ కడుపెనుబొజ్జ నొక్కయురగమ్మునఁ గట్టికిరీటమందునం
బుడుతచెల న్ఘటించి తృణపూజకె మెచ్చి భజించువారి కే
యిడుములు రానియట్టులు యథేచ్ఛ శుభంబు లొసంగువిఘ్ననా
థుఁడను గరుణించి మత్కృతికిఁ దోడనెపూర్తి ఘటించుఁగావుత౯. ౭
సీ॥ కనకకశిపు మదగజరక్తమత్త నృహరిమదనిర్మూలు శరభసాళ్వ
గర్వాంధ దక్షమఖధ్వంసనక్రియా విపులరౌద్రోన్నిద్రు వీరభద్రు
ఘనపిశంగ ప్రభాకలిత జటాఘటిత మణిమకుటుని బేతాళదేవు
ననితరవధ్యదైత్యహరణసంతోషితాఖిలామరవారు నలకుమారు
తే॥ గీ॥ నస్మదన్వవాయపరిక్రమాగతేష్ట,
దైవతంబుల మది సతతంబు నిలిపి
కొలుతువీరల నతిభక్తి ఘోరవిఘ్న
ములను బొలియించి మత్కృతిఁబూర్తి జేయ. ౮
మ॥ వటభూజాతముక్రింద వృద్ధమును లెవ్వానిం బ్రవేష్టింప ను
త్కటవేదాంతరహస్యము దెలిపి తత్తత్సంశయాంగంబులం
బెటిలంజేసెనొ యాకృపాళుఁ గరుణుం బెన్నొసగలు౯ గెంపులా
జటలం జంద్రకల౯ ధరించుఘను సప్రశాంతంబు నేఁ గొల్చెద౯. ౯
శా॥ శ్రీపత్యబ్జభవాద్యమేయమహిమశ్రీకంబులై భక్తిమ
త్పాపధ్వంసనపాండితీకములునై భద్రంబులై మృత్యుజి
ద్రూపశ్రీకత నొప్పుబిల్వదళముల్ రుద్రాక్షలు భస్మమున్
శ్రీపంచాక్షరమంత్రరాజము నురుశ్రేయస్సుల న్గూర్చుత౯. ౧౦
క॥ నందికి భృంగికిఁ జండికి, వందనములు ప్రమథులకును బసవాదిధరా
స్యందనభక్తిధురంధర, బృందములకు మానులకును వినతు లొనర్తు౯.
సీ॥ వల్మీకసంభవు వ్యాసునిఁ గాళిదాసుని భారవి న్మాఘుఁ జోరుభాసు
బాణు భట్టి మయూరు భవభూతి జయదేవు మల్హణు బిల్హణు మ
ల్లినాథు, వరరుచి శ్రీహర్షుఁ బండితరాజు విద్యానాథు భట్టమురారి
భోజు,దండిని వేంకటాధ్వరిసుబంధునిఁ గృష్ణు నప్పయయజ్వ ననంతభట్టు

తే॥ గీ॥ దశవిధనిఘంటువులు చేసి దశదిశలను
యశముఁ గాంచిన యమరసింహాదిఘనుల
సంస్కృతకవీంద్రులను గడుసన్నుతింతుఁ
గావ్యనిర్మాణకుశలత కలుగుకొఱకు॥ ౧౨
ఉ॥ నన్నయభట్టు నాంధ్రకవనప్రథమ ప్రథితాభిధానసం
పన్నుని భారతం బనెడి పంచమవేదము దెల్గుసేయ ము
న్నున్నగఁ ద్రోవఁ జూపినప్రపూజ్యుని శబ్దగణానుశాసను
స్సన్నుతిఁ జేతు వర్ణగణశబ్దవిశుద్ధికి నాత్మ నెంతయున్. ౧౩
ఉ॥ మిక్కుటమైనకీర్తి పుడమింజెలువొందఁగ ధర్మపద్ధతు
ల్చక్కనిశైలి నెల్లరకు సంశయము ల్విడఁ దేలునట్లు పే
రెక్కినభారతంబు రచియించినప్రోఢ మహానుభావు నా
తిక్కనసోమయాజిఁ గణుతింతుఁ గవిత్వపటుత్వసిద్ధికిన్. ౧౪
చ॥ ఇలఁ గలయాంధ్రసత్కవుల కెల్లఁబ్రమాణము భారతంబు నే
యలఘుఁడొనర్చి మెప్పుఁ గొనె నట్టిమహాత్ముని నన్నపార్యుతోఁ
దులఁదగువాని సాధుజనతోయజమిత్రుని సచ్చరిత్రు నే
నెఱమిమెయిం బ్రబంధపరమేశ్వరుఁ గొల్చెద శంభుదాసునిన్. ౧౫
ఉ॥ తుమ్మెదగుంపు జుమ్మనుచుఁ దోయరుహమ్మును మూఁగురీతి సా
రమ్ముఁగ్రహించి పండితులు ప్రస్తుతిఁ జేయుచుఁ జుట్టుముట్టఁగా
నిమ్మహిఁజేసె భాగవత మిద్ధచరిత్రుఁడనర్థితాంకుఁ డా
బమ్మెరపోతరాజు ప్రతిభాయుతుఁజేయుత నన్ను నర్మిలిన్. ౧౬
సీ॥ అలసానిపెద్దన్న కభివందనమ్ములు నందితిమ్మన్నకువందనములు
రామలింగయకుఁబ్రణామము ల్పింగళసూరనకవికిసంస్తుతులునతులు
తెలగనార్యునకునంజలులడిదముసూరనకుఁగూనిమంచితిమ్మకవిసార్వ
భౌమున కభినతుల్ప్రణతులేనుఁగులక్ష్మణకవీశునకునుతుల్నాకునింక;
తే॥ గీ॥ నెవ్వరెవ్వరిగ్రంథంబు లింతమాత్ర
మైన తెలివిని బుట్టించె నట్టిఘనుల
కెల్లఁజేతులజోడింతు నీప్రబంధ
మవని నిర్దోష మైపూర్తి నలరుకొఱకు. ౧౭

క॥ శ్రీకాశీనాథసన్యం, శ్యాకల్పు నఖండశివసమర్చానల్పున్
లోకగురుం బ్రహ్మయలింగాకారుని నపరశివుని నభివాదింతున్. ౧౮

క॥ ముదికొండవంశభవునిన్, సదయుని గౌరీపతితనుసంభవు సుగుణా
స్పదమంత్రిశాస్త్రిఘనకో,విదునిన్ రామేశగురుని వినుతింతుమదిన్.

సీ॥ కాశినాథకులాబ్ధికల్పతరువు నల్లమార్యగురువు మొదలభినమించి,
పాలంకవంశసంభవరత్న మాలింగయమనీషిపదముల నాత్మఁగొలి
చి, ప్రీక్షితతాడేపల్లివంశభూషణ మగు వేంకటాఖ్యకవికి వినతులొ
సఁగి, పక్కలంకాన్వయపావనుండగు వీరభద్రవిద్వన్మణిఁ బ్రస్తుతించి

తే॥ గీ॥ శ్రీమదద్దేపలికులాబ్ధిసోమసోమ
నాథశాస్త్రీంద్రునకు మ్రొక్కి నమ్మికొలుతు
గుమ్మలూరికులాంభోధి కుముదబంధు
సంగమేశ్వరతార్కిక సార్వభౌము. ౨౦

క॥ చేగంటివంశమణి ఛందోగురు మృత్యుంజయాభిధుం దైవజ్ఞుం
యోగజ్ఞానోదధినను, రాగాంచితచిత్తు మిగులఁ బ్రార్థింతు మదిన్. ౨౧

ఉ॥ చిన్నతనంబునందు శ్రమఁజేసి యజస్రము విద్య నేర్పుచో
నన్నుఁ బరీక్షఁజేసి సహానంబున నాకుఁదసంత లెస్సగాఁ
గొన్ని తెనుంగుపొత్తముల గొంకక చెప్పిన మేటిఁ జిన్నవి
య్యన్నమనీషి మాతృకులజాభరణుం బ్రణుతింతు నిచ్చలున్. ౨౨

గీ॥ మఱియు నాయెడ మిక్కిలి కరుణ కలిగి
వెలయు విద్వాంసులకు నెల్ల వేలకొలఁది
ప్రణతు లొనరించెదను మత్ప్రబంధరత్న
మునకు వన్నెల నిడియెద రనెడివాంఛ. ౨౩

సీ॥ ఏమహాత్మునకు వీరేశలింగారాధ్యమణి తపఃఖని మహామహుఁడు
తాత, ఏసత్యసంధున కాసర్వవిషయప్రచండుఁ డక్షయ దేశికుండు
తండ్రి, ఏఘనునకు మనీషాఘనుల్ మంత్రమూర్త్యాఖ్య వీరేశలింగా
ఖ్యు లనుజు, లేయనఘునకు విధేయులు రామలింగాభిధుఁడును
మల్లికార్జునాఖ్యుఁ,

తే గీ॥ డాత్మజులు నాత్మజలు భ్రమరాంబసుంద
రాంబ యన్నపూర్ణ యనఘు లైరి యట్టి
వీరమల్లేశ్వరారాధ్యు వీరశైవ
మతరహస్యజ్ఞుమాతండ్రిమదిఁదలంతు   ౨౪

సీ॥ ఆత్రేయగోత్రజుం డనఘుండు నాగలింగారాధ్యుఁడలఘుఁడేయమ్మ తండ్రి,యనఘ లక్ష్మి దేవి యనఁ బేరుఁగాంచిన,తల్లి యేతల్లికిఁదాను తల్లి,యధిక మేధావంతు డా రామలింగవి ద్వాన్మాన్యుఁడన్న యేధన్యతమకు, శ్లాఘ్యకార్య కరణచాతుర్యధుర్యుఁడు మల్లనారాధ్యు డేమాన్య సనుజుఁ,
తే॥ గీ॥ డధికపతిభక్తి లక్ష్మమ యనుగుననుజ
యయ్యె నేయమ్మ కాభ్రమరాంబకు ననుఁ
గన్నతల్లికిఁబతిభక్తి కరుణ కీర్తి
కలపురంధ్రికి మ్రొక్కెదఁ గరము భక్తి.   ౨౫

గీ॥ తండ్రి మైక్యంబు నొందినఁ దానె మమ్ముఁ
బ్రోచి పెద్దలఁజేసిన పుణ్యమూర్తి
యన్నపూర్ణాభిధకు విభుం డమ్మఁబెంచి
నట్టిఘను బాపయారాధ్యు నాత్మఁదలఁతు.   ౨౬

ఉ॥ వెన్నకు నొజ్జమార్దవపుఁబెంపునఁజిత్తము వాగ్విభూతిఁబే
ర్కొన్న సుధారసం బనఁదగు నొమ్మగ వజ్రునిఁగేలి సేయు వి
ద్వన్నుత మాశవిత్వరసపాటవ మిూగి కడింది యంచు మా
యన్నను రామలింగకవి నంజలిఁజేయచుఁబ్రస్తుతించెదన్   ౨౭

సీ॥ పుట్టువుమొదలు నేబుద్ధిమఁతుఁడు నాకుఁబ్రాణమిత్రం బాచుఁబ్రిధ నొసంగు, సాంధ్రగీర్వాణవిద్యారసగ్రహణ కుశలతనానెవనికిఁ గల ధనంబు, వడివడి ముత్యాలవలె వ్రాయ రాగశైలిని పురాణముఁజె ప్పుఘనుడెవండు, వైద్యమందును గవిత్వమునందును సమర్థుడగుచు నెవ్వాండలరారునట్టి,
తే॥ గీ॥ ప్రధితు శ్రీపతిపండితవంశమణిని
మల్లికార్జునారాధ్యకుమారముఖ్యు

మత్పితృష్వస్సృపౌత్రుని మదిగణింతు
నాగలింగమనీషి ననారతంబు ౨౮

సీ॥ భక్తిమై లక్షతొంబదియాఱువేలయయ్యల కర్చన మొనర్చినట్టిమే
టి, మల్లికార్జునమంత్రి మహనీయుఁ డెవనికిఁబ్రపితామహుఁడు ని
త్యభక్తదాత, తాత భైరవమూర్తి తండ్రి బసవరాజమంత్రి సచ్చరిత్రుం
డు మాననీయ, యచ్చమాంబ జనని యఖిలసద్గుణనికరాఢ్య లక్ష్మి
దేవి యగ్రజాత.
తే॥ గీ॥ నాగమాంబిక సతి సుత నాగరత్న
మతిదయాపాత్రి మేను నై యమరునట్టి
కందుకూరివంశాబ్ధిరాకానిశాధ
పతిని శ్రీశైలపతిని నేఁబ్రస్తుతింతు. ౨౯

సీ॥ ఇంగ్లీషు మొదలిడి యేయేడువిడువకదానె ప్రప్రథమతఁదప్పకుం
డఁ, దత్తత్పరీక్షల నుత్తీర్ణుఁడైబియేపట్టమందుకొనినయట్టి దిట్ట,ఆంధ్ర
గీర్వాణవిద్యల బల్లిదుఁడు బద్యరచనాప్రవీణుఁడురాగవేత్త, జ్యోతి
షాంశజ్ఞుఁడు సకలసజ్జనమహానందప్రదుండు సన్మార్గవర్తి.
తే॥ గీ॥ పిన్నవాఁడు మిగులఁబ్రేరించి నాచేత
నీప్రబంధము రచియింపఁజేసి
శ్రీగిరిశుఁగలసి శ్రీశైలపతి యను
పేరఁ గృతినిఁగొనినధీరుఁదలఁతు. ౩౦

సీ॥ ముదిగొండవంశసంభూతమణులు వేదవిదు లాగమాంతకోవిదులు
సాధు, లఖిలప్రతిష్ఠలనాఱితేఱినవారు లింగయవీరేశలింగయావ,ధా
నులు దండ్రి భ్రాతయుఁగాఁగ హైమవతీసాధ్వి తల్లిగాఁదెలివి కలి
గి,పతిదేవత లనంగఁబరగెడిశ్యామలాంబయు భ్రమరాంబ యప్పలు
నుగాగ.
తే॥ గీ॥ భద్రజలజాస్య యనుజగాఁబతిని నన్ను
దైవ మని గొల్చుచుం జిన్నతనమునందె
యంబ వీరమల్లేశ్వరుం డనెడిసుతను
సుతునిఁగనియొప్పుదుర్గకౌ సతతము శుభము. ౩౧

సీ॥ నిశ్చలైశ్వర్యులు నిరుపమభక్తులుమంత్రిసింహులు నిడమర్తివారు,
సఖిలదిగ్విదితు లనాదిసంపద్వంతులైనదారావారు ననుపమానులైన
దుర్గావారు నట్టిఘన్నావారు మాజేటివారును మండవిల్లివారు న
త్యంవారుఁ బత్తివారును బచ్చి, గోళ్లవారునుకొనకళ్లవారు
తే॥ గీ॥ మున్నుగాఁగలశిష్యులు మూఁడువంద
లేఁబదిభవనములవారు నేకరీతి
భక్తిఁబూజింపఁబరఁగెడివాఁడ సాధు
జనవిధేయుఁడ మల్లికార్జునుఁడ నేను. 3౨

కం॥ అనియిష్టదేవతలకును,మునులకుఁ గవివరులకు గురుముఖ్యులకునుమ
జ్జననీ జనకాదులకును, వినతులనిడి సఖులఁదలఁచి విడిచిఁకుకవులన్.

షష్ఠ్యంతములు.

కం॥ ఈశున కవతంసితరా, త్రీశునకు న్భూషితభుజగేశునకు గణా
ధీశునకుం దారాపథ, కేశునకు నిజాంఘ్రినిహతకీనాశునకున్. 3౪

కం॥ సాంబునకు భుజంగప్రా, లంబునకురమాసుహృత్కలంబునకుఁగృపా
లంబున కంకస్థితహే, రంబున కాక్రీడితకుధరనితంబునకున్ 3౫

కం॥ శంభునకు హృతాఖిలఖల, దంభునకును నిజకళత్రదారితదృప్య
చ్ఛుంభునకు సదానతహృత,జంభునకుం దిప్రపురవిజయసరంభునకున్.

కం॥ భవునకు హృతభక్తపున, ర్భవునకు నేత్రాగ్నిదగ్ధభావభవునకుం
బ్రవిదారితసానుజదను, భవునకు దేవార్థదత్తబహువిభవునకున్. 3౭

కం॥ హరునకు వ్యాఘ్రాసురసం, హరునకు గిరిరాజకన్యకాత్యంతమనో
హరునకు నజ్ఞానతమోహరునకు నతిదృప్తదక్షయాగహరునకున్.

వ॥ సమర్పితంబుగాఁ దత్ప్రసాదంబున నాయొనర్పంబూనినభోగేశ్వరమా
హాత్మ్యం బను మహాప్రబంధంబునకు నాయకాభిముఖీకరణవిజ్ఞప్తి
పూర్వకంబుగఁ గథాక్రమం బెట్టు లనిన. 3౯

కం॥ అంగజదుర్మదభంగా, గంగాకలితోత్తమాంగ కంధినిషంగా
తుంగవృషేద్రతురంగశు, భాంగా మెలకుర్తిమల్లికార్జునలింగా.

సీ॥ అవధరింపుముసర్వజ్ఞ! యఖిలరూప! విన్నవించెదనాకు నీకీర్తివలనఁ
దోఁచినట్టులుగాగొడగూచికథను,శ్రీబసవపురాణాంబుధిఁజెలఁగుసుధను

కం॥ భోగుల కావాసంబై, భోగేశ్వరునకును ముఖ్యపురమై భువిలో
భోగవతీపురమునఁగా, భోగేశ్వరపురమ మరును బొగడంబడుచున్

సీ॥ ఆపురంబుసమున్నతగోపురంబు,భూపురంధ్రికిమణిమయనూపురంబు
ధర-శిఁగలవిద్యలకునెల్లదాపురంబు,కలుములకునెల్లనల్లదెకాఁపురంబు

గీ॥ మందిరములిందిరామణిమందిరములు
సతులుసౌందర్యవిభవవసతులు వారి
పతులు తనుకాంతిజితరతిపతులు వారి
సుతులు సకలసద్గుణసమన్వితులు పురిని. ౪౪

కం॥ వర్ణాశ్రమధర్మసమా,కర్ణనపరిభూషితస్వకర్ణులు భగవ,
ద్వర్ణనగురు గోకర్ణులు,కర్ణులు దాతృత్వమున నగరిసద్వర్ణుల్. ౪౫

గీ॥ పురితురంగంబులకు వేగమునఁదలంకి
పోయి కురంగంబులు వహించె ముఖకువర్ణ
భావ మని సాది యగు నతిబలుఁడు గదిసి
యోడి యతిరూపతవహించియుండు నెపుడు. ౪౬

గీ॥ ధరములును దలకిందు లై పురగజంబు
లకు భయంపడి తరలెడిఁ జకితములయి
నీరుగార వోదంతినా నీరదములు
దంతులకు నీరదముల కంతరము లేదే!

చ॥ చలువల రేడు బట్టణపుసౌధతలంబులపజ్జ నేగుచోఁ
జెలిమలఁగూడి యాడు సరసీరుహలోచనల న్మరంగియుం
పలరఁగమోవు లానునెడ నయ్యమృతంబు గదోష్ఠసీమలం
దాలికెనో!కా దటన్న నమృతోష్ఠ లనం బని యేమి వారలన్

గీ॥ భోగనాధుని గొలువ నభోగభావ
మెడలు నని యెంచి పురి వసియించు నలన
భోగకాంతలె తద్దయ భోగకాంత
లగుచు నవిఫలసౌందర్యలైరిభళీర! ౫౦

గీ॥ అమలభావంబు గాంభీర్య మధికకీర్తి
యధిగతామరసత్వంబు ననుపమాన

ధనసమృద్ధి కలిగి పురవరమునందు
సరసులనఁగోలు సరసులు దరమె పొగడ. ౧౦

ఉ॥ ఆటలఁబాటల న్మరగి యాపురిఁబువ్వులతోఁటలందు స
య్యాటములా న్మెలంగు జవరాండ్రకుఁజొక్కి భ్రమించుగండుతే
టేఁటులతోఁ డిపాటు పువుదీవియ లంటుచుఁ బాటఁబాడుచుఁ
గోటి కొకండెపో! రసికకోటులఁదేఁటులఁగూడుఁబోటులన్. ౧౧

కం॥ ఆపురమున నీశ్వరపూ,జాపరతంత్రుండు వేదశాస్త్రపురాణ
వ్యాపకుఁడు దానశీలుఁడు,శ్రీపూర్ణతధర్మరతుఁడు జెలఁగుచునుండున్

చ॥ పరులధనంబు టన్నఁబొరపాటుగ నైనను కన్నువిప్పఁడా
దరమునఁ సద్విసంఘములఁ దద్దయుసంతసమందఁజేయు నం
దిరమున షడ్రసాన్నములఁదృప్తి నొసంగుచు నండు నేనికిన్
దురతిశయంబు నన్యజనదూషణమున్న వెలుంగఁజేట్టినో. ౧౨

కం॥ విద్యానిధి యతఁ డురుదయ,
విద్యార్థుల కెపుడు సకలవిద్యలఁ గఱపున్
విద్యానిధి యొరులకుఁ దన,
విద్యలఁ గఱపుటకు నెపుడు వెఱఁగనఁడెందున్. ౧౩

కం॥ ఆధర్మరతునకు సతి, యైధరణిం దగె సుశీల యను తన్వి సదా
రాధనలాలన సొంప,ర్యాధారత్నోణి సద్గుణాంచిత యగుచున్. ౧౪

సీ॥ ఇరుగనిపొరుగని యెన్నఁడేయింటికిఁబోదు పోయినను గొబ్బున నె
నచ్చుఁ,బనిపాటలొరులు సెప్పకమున్నె చూచుఁ జెప్పినఁదప్పకుండఁ
దావిని యొనర్చు,అప్పునప్పుల నెప్పు డడుగ దెవ్వారల నడుగువారల
కెల్ల నిడుచు నుండుఁ, జుట్టపక్కములను జూచుఁ గౌరవమునఁ
దనుఁజూడకున్నఁ దాఁగనల దెపుడు.
తే॥ గీ॥ సిరియు సంపద యొప్పు మచ్చరపులేమి
దయయు హింసింపమియు మాటఁదప్పకునికి
మొదలుగాఁ గలసద్గుణములకు నిక్క
యాపెఁ బొగడంగఁ జాలమాయుజుఁ డునక్క ౧౫

కం॥ సతి పతికి న్బతి సతికి,న్సతతము సంతుష్టి సుఖము సంపాదించున్
క్షితిలో నే కానాదం,పతులకు నెందైన సాటివారలు గలరే. ౫౯
కం॥ ఆవిర్భవించె వారికి, భావప్రభవప్రభాప్రభావుండు జగ
త్ప్రోవిదుం డనఘుం డగుశివ,దేవుఁడు శివభక్తిమార్గదీపకుఁడగుచున్.
కం॥ కన్నులుదమ్ములకన్నలు, కన్నులవిండ్లనఁగఁదగునుకనుబొమ లెన్నన్
అన్నులకన్నుల కతఁడే,కన్నులవిల్కాఁడు మరుఁడుగలఁడే?చూడన్.
ఉ॥ అందనిమ్రానిపండు జతురాన్యలతాంగుల కంగజన్ముచేఁ
గందనిపూలచెండు జిరకాలము నోచిన యేవెలందికో
చెందిననోముపండు శశిశేఖరభక్తులలోన నీతఁడే
ముందుగఁ నొప్పుచుండు ననఁబొల్చుచునుండు ధరాతలంబునన్.
ఉ॥ దబ్బర లాడఁబోఁడు తనతల్లికిఁ దండ్రికి మాఱు చెప్పఁ డే
గుబ్బెత వచ్చికోరినను గూడఁడు దూఱఁడు కూళలందు మే
నుబ్బదు మెప్పుమాటలకు నోరుపుకల్గినవాఁడె యాతఁ డెం
తబ్బుర మాతనిం గనిన యాకృతకృత్యుల పుణ్య మెట్టిదో! ౬౨
శా॥ ఆమోమా మాసాగసౌకనుంగవ బెడం గామందహాసంబు తీ
రామాణిక్యమయోరుకుండలయుగోద్యద్గండభాగద్వయం
బామాధుర్యరసప్రధానమగువా క్కాప్రౌఢపాండిత్య మే
భామాపుణ్యఫలంబొ! యం చనని శంపాగాత్ర లెంచుందురే. ౬౩
సీ॥ ఇట్లు సౌందర్యసుగుణసమృద్ధుఁడగుచు
నెల్లదిక్కుల మిక్కిలి నెన్నికఁగని
పేరుదెచ్చినసుతునకుఁ బెండ్లిఁజేయ
వలయు ననితల్లిదండ్రులు దలఁచుచుండ. ౬౪
ఉ॥ కుండలి పండితుండు ఫణికుండలభక్తుఁడు గార్యసాధనో
ద్దండుఁడు భూసురుం డతిథి తా నొకఁడింటికి వచ్చుచుండగాఁ
బండుగ నేఁడు మా కనుచు భక్తి నెదుర్కొని తోడి తెచ్చి యా
పండితుఁ గారవించి మృదువాక్కుల నాతని తాతఁ డిట్లనున్. ౬౫
ఉ॥ ఎచ్చటినుండి వచ్చితి? రికెచ్చటి కేగెద? రేమికార్య? మీ
రిచ్చటి కేగుదెంచుటయు నేము కృతార్థుల మాట కేకదా!

చెచ్చెర మాకు మీ రెలుకఁ జేయరె? వేడుక యయ్యె నావుడున్
మెచ్చి వచింపగాఁ దొడఁగె మెల్లన నాతనితోడ విప్రుఁడున్. ౧౬

శా॥ శ్రీరత్నాకరమేఖలామణిమయగ్రైవాకలాపంబు ర
మ్యారామక్రమవిహారచిత్తజ హయవ్యాహారచౌర్యక్రియా
ధీరాధీరవిలోకనాజనసముత్కీర్ణంబు సప్తస్థలా
గార ప్రోజ్జ్వల మొప్పు మాపురము భాగ్యస్థానమంబునన్॥ ౧౭

సీ॥ అప్పురంబున వసియించుఁ గొప్పకీర్తి
గలిగి సత్యవ్రతుం డనుఘనుఁడు భక్తి
గొలిచి శివుని భజించుచు నలఘుశక్తి
బుద్ధిమతి భార్యయై కొల్వఁ బూర్ణశక్తి. ౧౮

ఉ॥ మేడలు మిద్దెలుం బురులు మేలుబవంతులు దొడ్లు దోఁటలుం
బాడియుఁబంటయు న్నిఖిలభాగ్యము లున్నను విప్రుపీఁగఁ దే
జాడ మెలంగునో తెలియశక్యమె! వేయననేల చూడఁ డీ
రేడుజగంబులం దతని కీడు గనంబడరా దొకింతయున్. ౧౯

సీ॥ అత్తకు మామకు నఖిలోపచారము ల్సక్రమంబుగ నెమ్మి సలుపు
చుండు, బావల మఱఁదుల పనుల ముందుగఁ జేయు, నాఁడుబిడ్డలయె
డ నణఁగిమెలఁగుఁ, బతిరొద్ద బహుభయభక్తియుక్తిఁ జెలంగుఁ దో
డికోడండ్రతోఁ గూడి యుండు,దల్లికిఁ దండ్రికిఁ దగినకీర్తి ఘటించు బం
ధువులను గౌరవముగఁ జూచు;
తే॥ గీ॥ సతిగుణులకు నెల్ల నేవేళ సదనసంభ్ర
మమున షడ్రసశాల్యోదనముల సాద
రముగ నిడు బుద్ధిమతితోడ నమణు లెవరు
సాటిరా రనఁ జను వేయుమాటలేల. ౨౦

క॥ భూతలరతికుసుమాయుధు,లాతరుణియుఁబతియుసతతమతివేలయశం
బేతీరునఁ జేకూరునొ, యాతీరుననే నటింతు రరిదిగ జగతిన్. ౨౧

కం॥ వారిరువురకు జనించెను, వారిజముఖి వారిజాక్షి వారిజగళయున్
వారిజకర వారిజపద, మానినిదొనయనఁగ సర్వమంగళసుతయై.

సీ॥ తెలుసతెలుసంబు వర్ణింపఁ జేతఁ గాక
చిలుకఁజేఁ దథోగతిఁ బడి తలలు వంచె
ససఁగ జడఁబోఁడఁగని జడ మైనకారు
మబ్బు నిలువున నీరాట యబ్బురంబె. ౨౩

సీ॥ బాలసౌశీల్య మభ్యసింపంగ వచ్చి
పిలుగానక వెల్లనై వేచి యెప్పుడు
వాణి తలవాకిటనె యుండు వారిజాక్షి
సుగుణసంపత్తిఁ జూచినఁ జోద్య మగును. ౨౪

సీ॥ కన్నెగుణముల గణియింపఁగడఁగి యోడి
తెల్లపోయి తా జీవింపఁజెల్ల దనుచు
విషము మ్రింగియు శివుఁడు జీవించి మూలఁ
బడియె నిక నేమి వచియింపఁ గడఁగువాఁడ. ౨౫

సీ॥ సకలజగదద్భుతాకారసౌష్ఠవంబు
సుగుణసంపత్తి సుకులప్రసూతి కలిగి
చెలఁగు మాసర్వమంగళాజలజముఖికిఁ
దగినవాఁడని విని భవత్తనయుఁ జూడ. ౨౬

కం॥ నను నాసత్యవ్రతుఁ డం, పిన నిట కేతెంచినాఁడఁ బేరు సుధర్ముం
డనివాడుమను పురోహితుఁ, డను వారి కటన్న వినితటాలున వారల్.

మ॥ సుతు రప్పించినఁడన్మనోహరవయశ్శోభాశరీరప్రభా
న్వితసాహిత్యకవిత్వశక్తులకు సంతోషించి తా నప్డు దం
పతులం గన్గొని పల్కె మీసుతున కాపద్మాస్య యాతన్వికిం
జత మీపుత్రిఁడె వేఱులేరు ధరణీచక్రంబుగాలించినన్. ౨౮

కం॥ ఏతాదృశానుగుణ్యస, మేతుల వీరిన్ ఘటించి మెప్పొందుటకే
పో! తగినపేరు లిడి యా, ధాతయు ననుకూలుఁడయ్యెఁదడ నేమిటికిన్

కం॥ మాసత్యవ్రతుకన్యను
మీసుతునకు నిచ్చి జగము మెచ్చఁగ మేమీ
మాసమునఁ బెండ్లిఁజేతుము
వేసము హూర్తంబు నరయఁ బిలువుఁడు బుధులన్. ౩౦

కం॥ నావిని తగుసంబంధం, బే పచ్చె నటంచుఁ బొంగి యియ్యకొనుచు వే
దైవజ్ఞశిఖామణులన్, రావించితమరును వారు రాద్ధాంతముగన్ ౬౧

వ॥ పంచాంగశుద్ధిసహితంబు, నేకవింశన్మహాదోషరహితంబు నగు నొక
యుత్తమోత్తమసుముహూర్తంబు నిశ్చయించి రంత ధర్మరతుండు
సమాగత సిద్ధాంతి జనంబుల నుచితాధికసత్కృతుల బహూకరించి,
పనిచి సుభక్ష్య సాపూపంబులగు షడ్రసోపేత భోజనంబుల నమూ
ల్యంబులగు మణిమయాంబరాభరణంబుల ననాఘ్రాతపూర్వా
పూర్వ సౌరభధురంధరంబు లగు సరిక్రందనాదులఁ బూగకర్పూరై
లాలవంగజాతీ ప్రముఖపూర్ణంబు లగు తాంబూలంబుల గౌరవిం
చిన, నతండును సంతోషపరవశుండై సకలబంధుమిత్రపురోహితప
రివారసహితంబుగ సావకాశంబుగఁ దరలి సుముహూర్తంబునకు
దయచేయుండని సభాజనంబున ధర్మరతు వీడ్కొని భాగ్యస్థాసన
గరంబునకుం జని బుద్ధిమతీసత్యవ్రతుల కీవృత్తాంతంబు సవిస్తరం
బుగా నెఱింగించిన, వారు నపారసంతోషపారావారంబునం దేలి
యత్యధికసంతోషకరంబులగు సత్కారంబుల సుభద్రు గౌరవించి
యనిపి సుముహూర్తంబు ప్రత్యాసన్నం బగుటం జేసి ససంభ్ర
మంబుగ. ౬౨

గీ॥ పెండ్లిపను లెల్లఁ జేయించి పిలువఁ దగిన
వారి నందఱి రావించి బంధుమిత్ర
పౌరవిద్వత్పురోహితపరివృతు లయి
యొక్క యుత్తమోత్తమ సుముహూర్తమందు. ౬౩

గీ॥ సర్వమంగళతూర్యనిస్వనము లలర
సర్వమంగళలక్షణసహిత యగుచు
సర్వమంగళఁ దలపించు సర్వమంగ
ళాంబఁ బెండ్లికూఁతుం జేసి రంత నచట. ౬౪

గీ॥ ధర్మరతుఁడును శివదేవుఁ డగినరీతిఁ, బెండ్లికొడుకును గావించి తిండ్లు దీర్చి
బంధుమిత్రపురోహితభటులఁ గూడి, పల్లకీతోడను మారేగి బండ్ల నెక్కి.

గీ॥ వెడలి భోగేశ్వరపురంబు వీడి కొన్ని
పయనముల సుఖముగఁ జేసి భాస్కరుండు
పొడముతఱికి భాగ్యస్థానపురబహిరుప
వని విడిసిరి రే పెండ్లి నాఁ బరిభవమున. ౧౬

గీ॥ దానిఁగని పెట్టి వేగ సత్యవ్రతుండు
బండ్లు పానక మాదిగా వలయువస్తు
సమితిఁ గొని తూర్యములు మ్రోయ సపరివార
ముగఁ దదుపవని కేగి సమ్మోద మమర. ౧౭

కం॥ మగవారలుమగవారల,మగువలుమగువలనుదగతమత్వముమీఱన్
దగురీతి గారవించి వ, డిగ నూ రేగించి తగువిడిదిఁ జూపింపన్.౧౮

కం॥ అంతట ధర్మరతుం డ, త్యంతామోదోద్భరితహృదంతరుఁడగుచున్
వింతజిలుగుపనుల న్నలు, సంతయు నెడముండనట్టియావిడిదింటన్.

గీ॥ స్నాతకంబును నెఱవేర్చి సాపడంగఁ
దగినవారలు సాపడి తగుపగిదిని
గూరుచుండంగ భానుండు గ్రుంకె నపుడు
సాంధ్యకృత్యంబు లెల్లరు సలిపి రంత. ౨౦

తోటకము॥ సుముహూర్త్తము మించును చూడఁగ నే
లకొ మహామహులార! వెలందుల వే.
గమ రండనుఁ డాతఁడు గ్రన్ననఁ దా
మిముఁ దోడ్కొని రం డనమే మిటకున్. ౨౧

మత్తకోకిల॥ వచ్చినార మటంచుఁ గొందఱు వైదికక్షితినిర్జరుల్
వచ్చిచెప్పిన సంభ్రమంబున వార లందఱు నాగరుల్
మెచ్చగాఁ బురమేగి యేగిరి మేళతాళము లొప్ప సం
పచ్చయోన్నత మాకరగ్రహమందిరాంగణసీమకున్.౨౨

తరళ॥ ఎదురుగాఁజని వారు వారల నింతయుంతనరానిస
మ్మదమునం గొనిపోయి మందిరమధ్యభాగమునందుఁ గో
విదుల ముందరఁ గూరుచుండఁగఁ బెట్టి పెండ్లికుమారునిం
పొదవఁ బీఠమునందు నిల్పి మహోజ్జ్వలాంగులు పాడుచున్.౨౩

గీ॥ సక్రమంబుగ మంగళస్నాన మెలమి
వేగఁ జేయించి యుపయమవిధికిఁ దగిన
యట్లు కై సేసి వరునిఁ గల్యాణవేది
పీఠమందునఁ గూర్చుండఁ బెట్టి రపుడు. ౯౪

కం॥ ఆలోపుగ నే కొందఱు, నాళీకదళాయతేక్షణలు వే కన్యన్
మేలగుజలకము లార్చి సు, చేలాదు లలంకరించి చేర్చిరి పీఠిన్. ౯౫

గీ॥ వరుసఁ దత్పురోధలు వధూవరులచేత
వరుణ లిప్పించి తెరఁ బట్టి వరునికడకుఁ
గన్యఁ దెప్పించి వరునకుఁ గాళ్లు గడిగి
దార వోయుం డటంచు మంత్రములు నుడివి. ౯౬

గీ॥ కన్యకాదాతచేతను గడుముదమున
దారవోయించి తెరఁ దీసి తద్వధూవ
రుల శిరస్సుల మంత్రార్థములను జెప్పి
యక్షతల నుంచి రఖిలవాద్యములు మ్రోయ. ౯౭

చం॥ తెరతొలగించినంతనె తదీయవిలోచనమీనము ల్వర
స్పరము నెదిర్చి లోఁబడక శక్తి కొలందిని బోరుచుండ ను
ద్ధురమగులజ్జ యడ్డపడి త్రోసి యథాస్థలి నిల్పుచుండఁ ద
ద్గురుతనుభావప్రవాహములు గొంకకుఁడంచును దార్చు మాటికిన్

గీ॥ దంపతులచక్షురనిమిషదంపతు లభి
నవతదాస్యలావణ్యఘనప్రవాహ
ములకు నెదురీఁదు వలరాచవలలఁ జిక్కు
వడిన రాలేవనియొ యడ్డపడును లజ్జ. ౯౯

గీ॥ సర్వమంగళతూర్యనిస్వనము లలర
సర్వమంగళకు శివునిసరణి సర్వ
మంగళకు శివదేవుం డభంగసర్వ
మంగళదసూత్రము నొగి గట్టెం గళమున. ౧౦౦

గీ॥ ఒండొరులపైని దంపతు లొకరి నొకరు
నిజసుగుణజాలజనితకీర్తి జలనిధుల
నిట్లు ముంచెన మనురీతి నెలమిఁ దలలఁ
బోసికొని రప్డు తలఁబ్రాలఁ బొలుపుమీఱ. ౧౦౧

గీ॥ తత్పురోధలు దగుకీర్తి దంపతులకు
నుత్తరీయాంచలంబుల నొలిఁ దమల
పాకులు నొబ్బకలు స్వాదుద్రాక్షతలును
దక్షిణలు గట్టి ముడివేసి యక్షత లిడి. ౧౦౨

గీ॥ ధరణిసురసంఘములతోడఁ దగుపనసలఁ
గరము నాశీర్వదించి యక్షతలఁ దద్వ
ధూవరుల శిరస్సుల నుంచఁ గోవిదాళి
మెచ్చ విడెములు సందటికిచ్చి రంత. ౧౦౩

కం॥ శృంగారవతులు మేలిమి, బంగారపుఁబళ్లెరములఁబసపక్షతలుం
మంగళహారతులు నివాలు, గంగం గలకంఠకంఠకంఠధ్వనులన్.

సీ॥ మంగళం బతిలోకశృంగారమయులకు, మంగళం బబ్జాస్యకుండలుల
కు, మంగళం బత్యబ్జమంజుళాంబకులకు, మంగళం బతిసుకుమారుల
కును, మంగళం బురుగుణమండితతములకు మంగళం బఖిలాంగమం
డనులకు, మంగళం బన్యోన్యమానసోచితులకు, మంగళం బగణేయ
మంగళులకు;
తే॥ గీ॥ మంగళం బిలాతలరతిమన్మథులకు
మంగళ మఖర్వసౌజన్యమహితులకును
మంగళములు మాశివదేవమహితరణికి
మంగళంబులు మాసర్వమంగళకును.

గీ॥ అనుచు హాయిగఁబాడి యాయక్షతలను
దచ్ఛిరంబుల నుంచఁ బ్రధాన హోమ
మును బ్రవేశాఖ్య మాహోమమును గ్రమముగ
వేగఁజేయించి యొజ్జలు విధియుతముగ. ౧౦౪

కం॥ స్థాలీపాకంబును దా, మోలిం జేయించి షడ్రసోపేతముగం,
గోలాహల మమర నపూ, పాళులతోడ భుజించి రందఱితోడన్.
సీ॥ తొలినాఁటియలసట తొలఁగిపో మరునాఁడు, విశ్రమించు చుచితవి
ధుల నెఱపి, తగఁదృతీయమున సదస్యావసరమునఁ, గనిపెట్టి విప్రు
లగౌరవించి, యనుచార మగుటచే నలుఁగకదీరక, యలిగి నాల్గ
వనాఁటియలుకఁబుచ్చి, తచ్ఛరమక్షుపఁ దగురీతి శేషహోమమ్మును
దీర్చి సమంజసముగ;
తే॥ గీ॥ ఐదవదినంబునను రాత్రియందు నాక
బలిని నెఱవేర్చికొని తగుబహుమతులను
బడసి కలవరపాటుతో వారు బాల
నప్పగించినఁ జేకొని యాదరమున. ౧౦౭
గీ॥ పెండ్లికూఁతు వెంబడిని రా వీలు కలుగు
వారి నందఱిఁ బయనంబు వరుసఁ జేసి
యెలమి దండాటఁ దీర్చి యూరేగి బండ్ల
నెక్కి యేగిరి పురజను లెల్లఁజూడ. ౧౦౮
సీ॥ ఈయూరి కెన్నఁడు నిటువంటిపెండ్లి వా, రరుదేరు టేమెఱుఁగ మనె
డివారు, కుట్టనాదులయందుఁ గూడ మృదుత్వంబె హాస్యంబుల న్వారి
కనెడివారు, పిన్నపెద్దల గౌరవించెడివిషయం బటన్నను వారిసొ
మ్మనెడివారు, వారితో వచ్చిన వైణికాగ్రణుల కీయవనిలో సాటిలే
దనెడివారు;
తే॥ గీ॥ పెండ్లికూఁతునకును దగుఁబెండ్లికొడుకు
వీరియెత్తునకుం దగువారె వారు
వారికిని వీరికిని మనస్పర్ధ లేక
యయ్యెఁ గార్యం బనెడివారె యంద అహహా! ౧౦౯
గీ॥ జారులును జోరులును లేక సకలజనులు
సాధువర్తను లగుటచే సధనులకును
మానధను లకు ధనహాని మానహాని
కలుగకుండుటఁబెండిలి కరముఁ జెలఁగె. ౧౧౦

గీ॥ పెండ్లి యన నదె వేరొకపెండ్లి పెండ్లె
ధన మనఁగ న్యాయసంపాదితంబె కాని
కన్నియల నమ్మికొని మూటఁ గట్టికొనిన
ధనము ధనమొ? పాపౌఘసాధనమె కాని. ౧౧౧

గీ॥ కలుములకు లేములకు నేమి కలుగుఁ బోవు
దగినయీడును సద్వంశ్యతయును దెల్పి
సాధువృత్తియుఁ గలిగిన సద్వరునకుఁ
గన్య నిచ్చినవానికే కలదు ఫలము. ౧౧౨

సీ॥ వ్యర్థంబుగా నింతభాగ్య మన్యుల కేల బోనియ్యవలెననుబుద్ధి పుట్టి
నడుమ నన్నము గల్గి కడుగర్వమున ముఖ్యులను బువ్వలేనివా ర
నుచు విడిచి, కీడెంచి మేలెంచఁబాడియా నని రని ముందు మనోవృ
త్తిభూమిఁజూచి, నడుసవావులఁజూడవలదు భాగ్యం బున్నఁజాలని
యట్టిచుట్టాల వెదకి.
తే॥ గీ॥ తగనివరులకుఁ గన్నెల దారవోసి
తగుదు మని సిగ్గులేక యీధరణిఁ దిరుగు
యధములకు నెట్లు లభియించు ననుపమాన
కన్యకాదానఫల మది ఘనులసొమ్ము. ౧౧౩

సీ॥ ఆదట వా రనాయాసంబుగాఁ గొన్ని పయనంబులను జేసిభాస్కరా
స్త, మయసమయమున కాత్మపురీబహిరుపవనముఁ జేరి సాంధ్య
కృత్యములఁ దీర్చి, భోగేశ్వరాలయంబునకు నూరేగుచుం జని దేవుఁ
గొల్చి ప్రసాదముఁ గొని, మరలియూరేగుచు మంజుళాత్మీయహ
ర్మ్యాంగణాకాయమానాంతరంబు.
తే॥ గీ॥ చేరి చూర్ణోత్సవంబును జేసికొనుచు
సక్రమముగ గృహప్రవేశంబు సలిపి
భోజనాదిసంతృప్తులై ముద మెలర్ప
నుచితకాలంబు గడపుచు నుండ నచట. ౧౧౪

సీ॥ సత్యవ్రతుఁడుఁ దగుసత్కారము లొనర్చి, బంధుమిత్రాదులఁబంపి
తగిన, వారి భాగ్యస్థానపత్తనంబున కాత్మపుత్రికాజామాతృము

ఖ్యజనస, మానయనార్థంబుగా నంపిన న్వారి ధర్మరతుండును దగి నపగిది, గౌరవించి పనుపఁగా శివదేవాదు లుచితకాల మచట నుండి వారి;

ఆ॥ వె॥ వలన గౌరవింపఁబడి నెమ్మి భోగేశ్వ
రపురమునకు వచ్చి యపరిమితము
దబ్ధిఁ దల్లిదండ్రు లౌసుశీలాధర
రతులఁ దేల్చి రంత నతుల నియతి. ౧౧౫

వ॥ శివదేవుండు యథాపూర్వంబుగ ననుదినంబును

సీ॥ వేగుజామున లేచు వేదంబుఁ బఠియించుఁ దటిమించకుండంగఁదాన మాడు, సమయంబుదాఁటక సంధ్యవార్చును శిష్యసంఘంబులకు నెమ్మిఁ జదువుఁజెప్పు,ఁదగినవారలతోడఁ దండ్రి వేదాంతంబు దరుచు చుండ నోదిగి తాను వినును, తల్లిమాటకు సద్దు దాఁటక గృహ కృత్యములఁ జూచు నతిథిపూజల నొనర్చు;
తే॥ గీ॥ వీధిపెత్తనమును జేయ వెడలఁ డెపుడుఁ
గంటఁ జూడఁడు గలుకుల గర్వపడఁడు
భోగనాథునిఁ దగురీతిఁ బూజచేయు
చుండు శివదేవునకుఁ దుల్యుఁ డుండఁ డెందు ౧౧౬

కం॥ రంగీకృతాంతరంగ ప, తంగేందురథాంగ గిరిసుతాముఖజలరు
డ్భృంగా మునిమానసచ, కాంగా యలకుర్తి మల్లికార్జునలింగా

కం॥ దారాన్వయాబ్ధిపార్వక, తారేట్సూర్యప్రకాశతద్దనుజచంద్ర
స్ఫారహృదంతరసతతవి, హారా యలకుర్తి మల్లికార్జునలింగా. ౧౧౭

గీ॥ కష్టపడి పెంచుకొనిన నా కనకకన్య
నీకు దారవోసితి నయ్య నెనరుతోడ
నేలుకొను మతిసుకుమారి యెపుడు గష్ట
పెట్టకుము మమ్ము సంతోషపెట్టు మయ్య? ౧౧౮

క॥ దీనిం జదివిన వినిన మ, హానరులకు నిహముఁ బరము నపవర్గము గౌ
రీనాథుఁ డొసఁగు సకలాం,హోనాశనమిట్టిచరితముండు నెయందుక్.

సీ॥హారితగోత్రోద్భవుం డైనమల్లమపల్లి యక్షయగురునకు నగ్రిమాత్మ,
జుండుగణార్చావ్రతస్థుండు సాధు వౌవీర మల్లయాఖ్యారాధ్య
తల్లజునకు, భ్రమరాంబకుం దనూభవుండ విద్వత్సింహుఁ
శౌరామలింగయ కవరజుండ, మల్లికార్జునుండ శ్రీమల్లి
కార్జునకృపాలేశజకవన ప్రవేశుఁడనగు; తే॥గీ॥ నా
దుభోగేశమాహాత్మ్యనామక ప్రబంధమందు
న మొదటియాశ్వాస మిట్లు,ముగిసె నాచం
ద్రతారకముగఁ చెనర్చు,నట్లుచేయుతఁ
దీనిఁ జందాద్ర్ధమాళి. శ్రీ. శ్రీ. ౨౦౦
శ్రీ. శ్రీ. శ్రీ.



| పేజీ | పద్యం | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౪ | ౧౯ | ముదికోం | ముదిగోం |
| | ౨౧ | చేగం | చాగం |
| | ౨౩ | మఱి | మరి |
| ౫ | ౨౭ | నుధా | సుధా |
| | ౨౮ | బుద్ధిమఁతు | బుద్ధిమంతు |
| ౭ | ౩౨ | చెన్నా | చన్నా |
| | ౪౦ | యెల | యల |
| ౧౩ | ౭౪ | బెల్లి | బెండ్లి |

# భోగేశ్వరమాహాత్మ్యము.

## ద్వితీయాశ్వాసము

క॥ శ్రీకర గుణరత్నాకర, లోకహితాచరణ దానలోల సకలది
గ్వ్యాకీర్ణమహితకరుణా, శ్రీకంఠ కలాకలాప శ్రీశైలపతీ! ౧

గీ॥ అవధరింపుము సర్వజ్ఞ! యఖిలరూప!
విన్నవించెద నాకు నీ పేర్మి వలనఁ
దోఁచినట్టులుగా గొడగూచికథను
శ్రీబసవపురాణాబ్ధిలోఁ జెలఁగుసుధను. ౨

ఉ॥ దాత్రము జాతివల్లులకు దర్పకసైంధవసైనికాళికిన్
సత్రము గానసేందిరకుఁ జక్కని మిత్రము బుష్పధన్వికిన్
పాత్రము షట్పదావళికిఁ బౌష్పరసాంచితపానపాత్రమున్
చైత్రము సర్వపాంథులకుఁ జైత్రము దోఁచె ధరిత్రి నంతటన్ ౩

గీ॥ లతలు బుష్పించి విలసిల్లె క్షితిరుహంబు
లెల్లఁ జిగిరించి మిగుల రాజిల్లెఁ బొన్న
గున్నలను గూడి నవలత ల్గులుకుచుండెఁ
గోకిలార్భటు లఖిలదిక్కులను నిండె ౪

క॥ ఇందిందిరబృందంబులు, సందడుల న్వనుల మూఁగె సారసవిశిఖ
స్యందనములు వనరథ్యల, మందగతిం దరలసాఁగె మారుఁడు రేఁగెన్.

చం॥ చిలుకవజీరుఁ బుష్పవనసీమల నిల్పి యనల్పభక్తిఁ బై
దలులు మహోత్సవంబుల యథావిధిఁ గొల్చి తదర్పితంబులౌ
ఫలములఁ బానకంబులను వారుణులం బతియుక్తలౌచు నిం
పలరఁగ గ్రోలి పాచికల నాడఁ దొడంగిరి సంభ్రమంబునన్. ౬.

సీ॥ ఆసమయమున భాగ్యస్థానపురమ్మున సర్వమంగళయు నఖర్వమంగ,
ళముహూర్తమున నవలతవోలెఁ బుష్పిణి యైనఁ దజ్జననీముఖాబ్జవద
న, లలరుచు గేహదేహముల నలంకరించుకొనుచు శుభదతూర్యక
లనాద, మమరఁ బేరంటాండ్ర నందఱిం బిలిచి రావించి యుత్సవ
ముఁ గావించుచుండ.

తే॥ గీ॥ ధర్మరతునకు శుభ లేఖఁ దమపురోధ
యగు సుధర్ముచేఁ బంపె సత్యవ్రతుండు
ధర్మరతుఁడు సుధర్మునిఁ దగినపగిది
గారవించి పనిచియునుత్కంఠతోడ. ౭

సీ॥ సముచితదక్షిణావ్యాఘుసహితంబుగా నిజసహధర్మిణీముఖజలజముఖులఁ, బుత్రిమిత్రుం డౌ సుమిత్రుఁ బురోహితపుత్రుని నతని కళత్రమును స, పరివారముగఁ బంప వారు భాగ్యస్థానపత్తనంబున కేగి పరిణవ మునఁ, బుష్పోత్సవమ్మును బుచ్చి బుద్ధిమతియు సత్యవ్రతుండును స లుపుగార.

తే॥ గీ॥ వముఁలఁ బరితుష్టులై తగఁ బయన మగుచు
బహుమతుల నంది చని భోగపతిపురంబు
సుఖముగాఁ జేరి యచ్చటియఖిలజనుల
నిర్భరానందజలనిధిం దేల్చి రంత ౮

వ॥ నిజోపవనవిహారానుగుణసమయంబున.

క॥ శివదేవుఁడు దనసఖుఁ బు, ష్పవనికిఁ గొనిపోయి యచట భాసిల్లుసర స్సవిధవితర్దిని గూర్చుం, డి వచింపందొడఁగె నిట్లు నెచ్చెలితోడన్.

గీ॥ ధీకుశల యోసుమిత్రాఖ్య నాకు నీవు
మిత్రుఁడవును బురోహితపుత్రుఁడవును
గాన నేకార్య మైన సంఘటనఁ జేయఁ
జాలితివి కాంచి వచ్చితె? సకియ తెఱఁగు. ౧౦

కం॥ బంగారు మై మెఱుంగుల, రంగారు కురంగనేత్రిరమణీయవయ
శ్శృంగారసౌష్ఠవములవి,నంగా మనసయ్యెఁ జెపుమునా వినియతడున్

కం॥ సంగాతి వగుట నావల, నంగా దనినుడువఁజాల నలినజునకు నై
సంగాని కానివని యై, నంగాని వచింతు వినుము నాతగుపగిదిన్.

గీ॥ వెలఁదిముఖపూర్ణచంద్రుండు వెలయుచుంట
ధ్వాంత మనరాదు నీలాంబుదమును గాదు
మగువముఖశశి కూర్ధ్వగ మగుటవలన
నుభయమున నీలనభ మెపో! యువిదతురుము. ౧౩

గీ॥ పొలఁతి నాభీహ్రదంబునఁ బొడమురోమ
రాజినాళమునఁ దగు నురోజకమల
కోరకములకు వికచత కూడ దనుచు
నజుఁడు గూర్చిన చంద్రు డో నతివమోము. ౧౪

గీ॥ కాముకాగ్రగు లగుటచేఁ గలియఁ గూర్చి
నాస యనియెడి మేల్బొంగువాసములకుఁ
గట్టికొనినట్టి యా రతికమలశరుల
మీనుజెండాలె కన్బొమ లెమ్మెలత కరయ. ౧౫

చం॥ కువలయచంద్రబింబములకు న్నడుమన్ సృజియించెఁ జెల్లరే!
భువనములం గలంచు ఘనముం దగ దన్న సఖీశిరోజబం
ధవనదమండలంబున కపస్థలిఁ దన్ముఖచంద్రునందుఁ గం
దొవల సృజించి మెప్పుఁ గనెఁ దోయజసంభవుఁ డెట్టకేలకున్ ౧౬

గీ॥ గళము గా దది మదనుఁడు గదమునకు
గడిలునప్పుడు పూరింపఁ గడగి యొత్తి
పట్టు శంఖంబె యగుఁ గానిపక్షమునకు
సుగుణమూర్త్యాళి గురు వని చుట్టుకొను నె. ౧౭

గీ॥ వళితరంగప్రకాశిలావణ్యరసస
ముద్ర మురుముఖచంద్రమస్స్ఫూర్తిఁ బొంగి
పొరలు నని యేమొ! ధాత యా పొలఁతిభుజము
లనుచుఁ జెలియలికట్టల సమరఁ గూర్చె. ౧౮

గీ॥ మనసిజుఁడు జన్మధారుణి మారనటులు
గట్టికొనినట్టి మేల్మిబంగారుమేడ
లగును సతియురోజములు గావనిన నీల
శిఖరములు మకరాంకము జెలఁగు టెట్లు. ౧౯

గీ॥ కలికి నూగారు మారుని కత్తి తీరు
కలిగి చెన్నారు దీనితోఁ గలసి యాఱు
తూపు లని పేరు నారనఁ దొడఁగినారు
పద్మశరశూరునకుఁ దీనఁ బనులు దీరు. ౨౦

గీ॥ కలికి కుచకుంభములఁ బొల్చు కాముదంతి
యానుతుండంబుఁ జాచి తా నీరుఁ ద్రావు
నదమె పొక్కిలి కాంతోరుకదళికలను
విదళముగఁ దలక్రిందుగా నదియె త్రోచె. ౨౧
గీ॥ లేదు నడు మని వర్ణింపలేదు మేలు
జఘనవర్ణన మేఁ జేయఁ జాల నేల
జగతి వర్ణించవలె దానిసొగసు బళిర!
పిఱుఁదులో యవి మారుని బిరుదు లహహా! ౨౨
చ॥ ఉరుముఖచంద్రబింబము పయోధరమండల మాకసంబు ద
ద్వరకటిభూమిచక్రము నఘస్థలి నూరువులంచుఁ గంబము
ల్సరిగ సృజించి జంఘ లని చారునిజాంకముల న్రచించి యా
మరుఁడు ఘటించు కూర్మములె మానినికిం బ్రపదంబు లెన్నినన్.
కం॥ భారమ నారంభారమ, ణీరత్నము గూడఁ దగదు నీరజముఖికిన్
గీరమ నాయమ గీరమ,సారము నగ వగు సుధకు మసారము లలకల్.
గీ॥ హాస్యమున కైన నాజలజాస్యనోట
దబ్బరలు వినరావు సందర్భమృదుళ
మధురభావార్థగౌరవమహిమ తరుగ
దహహ! యతివ వాక్యామృతమందు నెందు. ౨౫
ఉ॥ ఆ నగుమోముసోయగము నాకనుదోయిహారంగు నామెఱుం
గా నునుచెక్కుటద్దముల యందము నా యరుణాధరంబుతీ
రా నవబాహువల్లుల యొయారము నా చనుగట్ల యొప్పిదం
బే నలినాయతేక్షణల కేనియుఁ గందుమొ? విందుమే? సఖా. ౨౬
కం॥ వే యేల? మూర్తిమతి వై, నీ యనుపమభాగ్యరేఖ నీరజముఖిగా
నీ యవని నవతరించిన, దో యనుఁగా? నీదుపుణ్యమో హా! యనినన్.
కం॥ విని బళియని శివదేవుం
డనురాగానందవిస్మయాంభోనిధుల
న్మునుఁగుచుఁ దేలుచుఁ దన యను
గును దానున్ స్వసదనములకుం జని రచటన్. ౨౭

గీ॥ సర్వమంగళయును దనసఖియ యైన
నిజపురోహితస్నుషవల్ల నిఖిలలోక
విస్మయానందకరము లౌ ప్రియుని సుగుణ
ములను విని యుంట ననురాగజలధిఁ దేలె. ౨౯

కం॥ ఇదెపో యదనని మదనుఁడు, గదనమునకుఁ గాలుఁ దూఁగి గాటంబుగఁ ద
ద్ధృదయంబుల నంబుల వడి, వడలెన్ బ్రిదిలెం దదీయపాటవమెల్లన్.

గీ॥ కమలశరునకుఁ దన్మనఃకమలయుగముఁ
జిక్కిన నొచ్చి విరహాగ్నిఁ జేర్చి రాగ
రసమున న్బదునిడి మెయిఁ బస తొలంగ
వారిపయి మార్చి గుటిఁ జూచి వైచి యార్చె.



గీ॥ ఒండొరులపైని గోర్కెలు మెండుకొనియె
సడలె నిదురయు నొడలును బడలెఁ బోడమె
నరతి పోయె సిగ్గరితన మమరె వెఱ్ఱి
స్మృతియుఁ దప్పగఁ దొడఁగె దంపతుల కపుడు. ౩౨

ఉ॥ తల్లులు దండ్రు లీ విరహతప్తుల నెట్లు భరింతు మంచు వే
యుల్లములందు జాలి దళుక్కొత్త నొకానొకమంచిముహూర్తమం
దెల్లజనంబులున్ బొగడ నేకముఁ జేసిరి వారి, వారు సం
ఫుల్లమనోరవిందు లయి పూర్ణసుఖాంబుధిఁ దేలుచుండఁగన్. ౩౩

గీ॥ ధర్మరతుఁడు సుశీలయుఁ దగినరీతిఁ
గొడుకుఁ గోడలు సేవింపఁ గొంతకాల
మఖిలసౌఖ్యంబులను బొంది యంత నొక్క
నాఁడు కొడుకతోఁ గోడలితోడ ననిరి. ౩౪

మ॥ కొడుకా! కోడల! మీసపర్యలకు మాకుం దృప్తి వాటిల్లె ని
క్కడి సౌఖ్యంబులపైనిఁ గాంక్ష లుడిగెం గాలంబు సార్థంబుగా
నడవి న్మౌనులఁ గూడి పుత్తు మిఁక నయ్యా! యమ్మ! సద్వృత్తులౌ
కొడుకు ల్గూఁతులుఁ బుట్టి సౌఖ్యములు మీకుం గూర్చుత న్నిచ్చలున్.

మ॥ అతిథుల్వచ్చిన నాదరింపుఁడీ యసత్యం బాడఁగాఁ బోకుఁడీ
పతిపై భార్యయు భార్యపైఁ బతియుఁ గోపం బూనఁగా రాకుఁడీ

వ్రతములొ సేయుఁడీ భోగనాథునకు సేవల్సల్పుఁడీ నిచ్చలున్
సతమా కీర్తి గణింపుఁడీ సమత శిష్యవ్రాతము బ్రోవుఁడీ. ౩౭
మ॥ అనిన న్గుండెలు జల్లన న్విని విచారాక్రాంతులై గద్గద
ధ్వనుల న్గన్నుల నీరుగ్రమ్మ నిటులన్ వాక్రుచ్చిరా యిర్వురుం
జనునే? మమ్మెడఁబాసి మీరు వనవాసం బాచరింపంగ మీ
కనుకూలంబుగ సేవ సల్పుటకు మమ్మంగీకరింపం దగున్. ౩౮
క॥ ఏటికి మా కీ సౌధము, లేటికి నీ ధనగృహంబు లేటికి నీ యూ
ళ్లేటికిఁ దోఁటలు విభవము, లేటికి మీపాదసేవ యే లేకున్నన్
గీ॥ తల్లిదండ్రులకన్నను దయ గలిగిన
యత్తమామలకన్న నీ యవని వేఱె
దైవ మున్నదే? మా కేమి దారి మీరు
మమ్ము వీడినఁ జెప్పుఁడీ! మాన్యులార. ౩౯
గీ॥ అనిన విని వారు నారితో నకట! మీరు
నగవకుఁడు మేము చెప్పిన పగిది వినుఁడు
భోగవిభు వీడఁ గూడ దెప్పుడును మీకుఁ
దల్లియును దండ్రి మామ యత్తయును నతఁడె ౪౦
గీ॥ భోగనాథుఁడు దయ సేయు భోగభాగ్య
ములకు మానవలెఁ దృప్తులై యిల ననేక
వత్సరంబులు గడుపఁగా వలయు నింటఁ
గానఁ గానకు రావలు కాదు మీకు, ౪౧
గీ॥ అని నుడివి వృద్ధదంపతు లాశ్రమావ
నులకుఁ జనిరి యా యువదంపతులును వారి
మాట జవదాఁటఁ జాలక సాటివారి
తోడిపాటుగ గృహమునందుననె యుండి. ౪౨
మ॥ సరసాలాపముల న్గవిత్వరచన స్సంగీత సాహిత్య ని
ర్భరమాధుర్యరసంబుల న్నిజనిజప్రాగల్భ్యము ల్చూపుచుం
జిరకాలంబు పరస్పరాధికసుఖశ్రీసంగ్రహాత్యంతత
త్పరులై సౌఖ్యము లొందిరాతరుణియుం దద్వల్లభుండు న్మహిన్

ఉ॥ అంతటఁ గొంతకాలమున కాశివదేవుఁడు మానసంబునన్
సంతతి లేమి మిక్కిలి విచారమునం దనధర్మపత్నికే
కాంతమునందు నిట్టులను గంజదళేక్షణ! నీవు చూడు మా
నంతకొంత లేదు మన కౌగసలోపము దక్క నేమిటన్॥ ౪౪

మ॥ స్థితిమూలంబు గుటుంబ వృక్షమునకుం జింతామహావల్లి కు
ద్ధతకుద్దాలము పూర్వపుణ్యములకుం దార్యాణ మక్షీణస
ద్గతికి న్హేతువు వార్ధకంబునకు.నత్యంతోపకారంబు సం
తతి లేకున్న వృథా సమస్తమును సుధ్యా! చెప్ప వే యేటికిన్. ౪౫

చం॥ సలిలము లేని బావి జలజంబులు లేని కొలంకు కార్యని
శ్చలనము లేని చిత్తము రసంబులు లేని కవిత్వ మర్థసం
కలనము లేని వాక్యము సుగంధము లేని లతాంత మెన్నఁడు
స్ఫలములు లేని భూరుహ మపత్యము లేమిని గాఁపురం బగున్. ౪౬

ఉ॥ ముచ్చికఁ జేసి పిల్లలకు మాటలు నేర్పుచు మాఱు పల్కుచో
నచ్చియు రాని మాటలకుఁ బక్కున నవ్వుచు వేగ గాఁగిటం
గూర్చి శిరంబు మూర్కొనుచు గూరిమి మీఱఁగఁ దెచ్చి దేనినో
యిచ్చి కృతార్థతం దనరు టెంత తపం బొనరింపఁ గల్గునో ౪౭

గీ॥ ఇటు లా కుటిలశిరోజను,నిటలాంబక భక్తిఘనుఁడు నెనరునఁదనచెం
గటనుంచి సుతులు దమక,స్పటికినిగనరామి మిగుల వగచుచునుండన్

సీ॥ నిడుదకెంజడగుంపు నీరెండలను గాయఁ దెలిబూది దెసలకుఁ దెలుపు
లొసఁగఁ, గటి నున్న చిఱుత చెంగావి పుట్టము కావి పిల్ల మబ్బు
సొగసుఁ బెంపుఁ జేయ, వెన్నునఁ జగిలించి యున్నకృష్ణాజిన
ముప్పరంబు చెలువుఁ గుప్పుచుండ, దండంబు నవకరకాండంబు
ననుకరింపగఁ గమండలువు చేఁ బరఁగు చుండఁ, .

తే॥ గీ॥ దన్మనోముఖనేత్రపద్మములు సెలఁగ
గాఢమోహాంధకారంబు గడకుఁ దొలఁగ
బాలపంకజబంధువు పగిది నటకు
వచ్చె నొకజడదారి జేఁ దచ్చెరువుగ.

ఉ॥ వచ్చిన నాతపోధనుని వా రెదురేగి మహాముదంబునం
జెచ్చెర దివ్యపీఠమునఁ జేర్చి యథావిధి నర్ఘ్యపాద్యము
ల్మెచ్చఁగ నిచ్చి పీనసల మెల్లన వీచుచుఁ బల్కి రీవిధి
న్వచ్చితె యస్మదన్వయము పావన మాటకుఁ దండ్రి! నేఁటికిన్ ౨౦

చం॥ మునికులపూర్ణచంద్ర! బహుపుణ్యఫలం బగు త్వత్సమాగమం
బునఁ గననయ్యెఁ గిల్బిషము వోయి మనంబు ఘనాత్యయాగమం
బునఁ గతకల్మషాంబువును బోలి వచస్సును గాయ మట్లె మహా
ననఘ! భవాబ్ధిమగ్నుల ననన్యశరణ్యుల మమ్ముఁ బ్రోవవే. ౨౧

గీ॥ భోగనాథుని దయ మాకు భోగభాగ్య
ములకు నేలోపమును లేదు మునివరేణ్య!
వయసు ముదిరెను లే దింతవఱకు నపత్య
మనెడిపరితాప మొక్కటి యతిశయించె. ౨౨

ఉ॥ సంతతి లేని వారలకు సద్గతి లే దని పెద్ద లందు రే
మెంత యభాగ్యశాలులమొ యిప్పటి కేనియుఁ గాన రాదు స
న్వంతయు వంశబీజము మహాత్మ! మముం దరిఁజేర్పు మయ్య! మీ
కెంతయొ పుణ్య ముండును మునీశ్వరసత్తమ! యార్తరక్షకా. ౨౩

గీ॥ మాకు మౌనీశ! పూర్వజన్మప్రకృష్ట
పాపఫలభూతతనుజాతలోపజనిత
ఘోరపరితాపశమనప్రకారనిపుణ
ముండునా? త్వద్దయారస మొండుదక్క. ౨౪

గీ॥ అనఘ! వేయేల మీ పాద మాన మాకు
దిక్కు లే రెవ్వరును మీరె దిక్కటంచు
నమ్మితిమి మమ్ముఁ బ్రోచుట న్యాయ మనుచు
నెఱుఁగ రే? మీరు ధర్మజ్ఞు లింతవారు. ౨౫

చం॥ అన విని మౌని యిట్టు లను నాతనితోడ గృహస్థరత్నమా!
విను మవివేకయోగమున వెగ్గల మా ననపత్యతావ్యథ
న్వనితకుఁ దోడుఁ గూడి వగవం దగునా? నిగమాంతవేది వీ
వును శివదేవ! భక్తజనపూర్ణసుధాకర సద్గుణాకరా. ౨౬

గీ॥ లేక యొకకొంత కల్గిన సాకఁ గొంత
రమ్య మగుబుద్ధి విద్యయు రాక గొంత
తగినసంబంధములు లేక ధరణిఁ గొంత
చింతఁ గలిగించు సంతతి కింత వంత. ౫౭

మ॥ జనకుం డెవ్వఁడు పుత్త్రుఁ డెవ్వఁడు సమస్తంబీశ్వరుండీవు ము
క్తి నపేక్షించెద వేనిఁ దత్త్వమును బోధింతున్ వృథాయాస మీ
తనుజాధీనఫలోద్యమంబు సుఖమా! తథ్యంబు నా వాక్యము
న్వినుమా! నీవును బాఱఁజూచుకొనుమా! విద్వజ్జనోత్తంసమా. ౫౮

చం॥ సుతశతకంబుఁ గన్న బలసూదనుఁడా! యనఁ జెల్లు నా కురు
క్షితిపతి యేమి సద్గతిని జెందె శుకాదు లపుత్త్రులౌచుఁ దు
ర్గతిఁ గనిరే! యపుత్త్రులకుఁ గల్గదు సద్గతి యన్నఁ జెల్లునే!
యతులును బ్రహ్మచారు లటు లైనఁ దరింతురటయ్య! యిమ్మహిన్

కం॥ అనిముని యనినను విని వని,తనుఁగని తనుభవులవలనఁ దమకపవర్గం
బునుగిరుణింపఁడటంచనె, మునినతఁడునుగడిఁదిపుత్త్రమోహముచనునే

కం॥ అన విని ముని తనమనమున, ననురాగముమిగులఁదోపనాతనితోని
ట్లను శ్రీశైలపతిని మన, మున నిడిపూజింపుడీ ప్రమోదముతోడన్.

గీ॥తత్ప్రసాదంబువలనసంతానమబ్బు,గలుగుమోక్షంబుగడపటికన్యవలన
శివపురాణప్రసిద్ధమైచెలఁగునీదు,చరితమనిచెప్పివేమునీశ్వరుఁడుచనియె.

సీ॥ ఆరుకాళిందికి నవరోధములు దీఱెఁబొక్కిలి సుడికిఁ బైకెక్క నాయె,
నంచనడలకు మాంద్యము మఱింత పొసంగెఁజనుజక్కులకు ముక్కు
ల నలుపలరెఁ,జెక్కుటద్దములకుఁ జిక్కెఁ ధావళ్యమీక్షణమదాళులకు
నార్జవము వచ్చెఁ గానామృతమునకు, గలిగె దార్ఢ్యంబు గళదరం
బునకు గాద్గద్య మమరె.
తే॥గీ॥ నావులింతలు బలమయ్యె నలరె యోకి
లింతలును వింతరుచులపై నింపు లెసఁగె
మేనియాభరణంబులె మిగుల బరువు
లయ్యె నయ్యెడ నవ్వీకచాబ్జముఖికి. ౬౩

గీ॥ ఇట్లు నవమాసములు మోసి యింతి మూడు
వత్సరముల కొక్కొక్కరి వరుస గుణని
ధియు యశోధనుఁడు నను తనయులఁ గడకుఁ
గన్నియను మంగళకరలగ్నములఁ గనియె. ౬౪

గీ॥ తగిన సుముహూర్తమున మహోత్సవము దనరఁ
బేరుఁ బెట్టిరి కన్యకుఁ బెద్ద లెల్ల
నిజమనోహరగుణముల నిఖిలజనుల
నూఁచి గోడఁగెడు నిది గోడగూఁచి యనుచు. ౬౫

ఉ॥ పేదకుఁ బెన్నిధానము లభించినరీతి నెడారిఁ దృష్ణచే
మేదినిఁ దూలువాని కొకమేటి సరోవర మబ్బినట్లు లే
రీఁదుచు మున్గునాతనికి నెచ్చటిదో యొక నావ యందిన
ట్లాదళితాబ్జలోచనుల కబ్బిన యా సుత సమ్మదం బిడెన్. ౬౬

కం॥ శ్రీనాగాంబాకృతపు, ణ్యానల్పఫలా! విబుధజనానందకరా!
దీనావన! నిజకీర్తి, శ్రీనిర్జితశారదాభ్ర! శ్రీశైలపతీ. ౬౭

కం॥ సూరిచకోరమృగాంకా, దారాసూర్యప్రకాశతదనుజహృదయా
గారా శ్రితజనముఖసర, సీరుహతరుణారుణకర! శ్రీశైలపతీ. ౬౮

గీ॥ కష్టపడి పెంచుకొనిన నా కవనకన్య
నీకు దారవోసితి నయ్య! నెనరుతోడ
నేలుకొను మతిసుకుమారి యెపుడుఁ గష్ట
పెట్టకుము మమ్ము సంతోషపెట్టుమయ్య. ౬౯

కం॥ దీనిం జదివిన వినిన మ, హానరులకు నిహముఁ బరము నపవర్గము గా
రీనాథుఁ డొసఁగు సకలాం, హోనాశన మిట్టిచరిత ముండునె? యెందున్

సీ॥ హారితగోత్రోద్భవుండైన మల్లమపల్లి యకుయగురునకునగ్రిమాత్మ
జుఁడు గణార్చాప్రవతస్థుఁడు సాధు వౌ వీరమల్లయాఖ్యారాధ్య
తల్లజునకు, భ్రమరాంబకుం దనూభవుఁడ విద్వత్సింహుఁ
డౌ రామలింగయ కవరజుండ,మల్లి కార్జునుఁడ శ్రీమల్లి
కార్జునకృపాలేశజకవనప్రవేశుఁడ నగు; తే॥ గీ॥ నా
దు భోగేశమహాత్మ్యనామకకృతి, యందునఁ
ద్వితీయాశ్వాస, మైననిదియు, ముగిసెనాచం
ద్రతారకముగఁ దనర్చు, నట్లుజేయుతఁ
దీనిఁ జందార్ధమాళి॥ శ్రీ. శ్రీ.
శ్రీ. శ్రీ. శ్రీ.



# భోగేశ్వరమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము

కం॥ శ్రీగౌరీముఖపంకజ, వాగమృతరసానుభూతిపండితభృంగీ
శా! గగనాంచితకేశా!, యాగవినాశా! పెడసపురాగస్త్యేశా. ౧

సీ॥ అవధరింపుముసర్వజ్ఞ! యఖిలరూప, విన్నవించెద నాకు నీ పేర్మివలనఁ
దోఁచినట్టులుగాగొడగూచికథను, శ్రీబసవపురాణాంబుధిఁ జెలఁగుసుధను.

గీ॥ ప్రత్యహామృతసేచనవర్ధమాన
కల్పలతవోలెగొడగూచి కరమువృద్ధిఁ
బొందుచు నోసదరుల మించి పుడమిజనులఁ
నిర్భరానందరసనీరనిధిని దేల్చె. ౩

గీ॥ కలికి శివజితుఁడగుచు నాకమలశరుఁడు
పౌరుషము లేక క్లీబభావంబు దాఁటి
స్త్రీత్వమున భక్తిరసమున శివుఁడులోఁబ
డంగవేసినవేషం బనంగఁ జెల్లు. ౪

గీ॥ స్వర్గమున ఘృతాచిసౌందర్యరమఁ జూచి
సురలు దన్నుఁ బొగడఁ జూచి యజుఁడు
గాచిపోసె నేమొ కనకంబుఁ గొడగూచి
గా ధరిత్రినరులు గరము వొగడ. ౫

మ॥ నిజదేహప్రభ కోడి తెల్లఁబడి వాణీభర్తతోఁ జాళువా
రజతం బంచు వచింపసాఁగిరి నను న్రిక్షింపవే! నా మహా
రజతం బంచు వచింపఁజేసెఁ బ్రజలనాఁజెల్లెఁ గార్తస్వరా
హ్వ జగద్విశ్రుతమై కడాని కపు డాహా! కన్య సామాన్యయే ౬

కం॥ కందము కచబృందము కురు
విందము బెదవి వికసదరవిందము లడుగు
లుక్కందములు రదములు నుడి మ
రందము చిందము గళంబు రాజవదనకున్. ౭

కం॥ మందమునడ చూపు మనమి
ళిందము జడఁజూడఁగాఁ గళిందజ యూ ము
క్ష్ందమునకుఁ గందము మెయి
కుందన మనుకొందము సనకుందరదనకున్ ౯

కం॥ కందము నా లే దాగా, యందము ఫణికన్యలందు నచ్చరలందున్
వందనములుదద్వర్ణన, కుం దరమా? మనకుఁ గన్నె గుణములువో గడన్

కం॥ ఏతాదృశగుణగరిమస
మేతతనుజలబ్ధమోదమేదురచేతో
బ్జాతు లగుచువా రుండఁగ
నాతనయకుఁ బంచమాబ్ద మాగత మయ్యెన్ ౧౦

కం॥ మంచిముహూర్తంబును యో
జించి యథావిధి తనుజకు శివదేవుఁడు శ్రీ
పంచాక్షరంబు నుపదే
శించి శివసమర్చ నభ్యసింపం జేసెన్. ౧౧

ఉ॥ మాఘము పుణ్యతీర్థజలమజ్జన శేష మహామహాసురా
ద్యోఘము సర్వమానవకృతోపయ మాదిశుభావహక్రియా
శ్లాఘము ఘోరకిల్బిషకృశానుకణప్రకరప్రశాంతికృ
న్మేఘము దోఁచె నయ్యెడ నమేయఫలప్రదతాత్యమోఘమై. ౧౨

కం॥ శ్రీగిరియాత్రాతత్పర, వాగమృతరసప్రవాహపటునినదసమా
యోగము బధిరితసర్వా, శాగజమై చెలఁగె సకలజనములువోగడన్.
అయ్యెడ.

కం॥ ఆదంపతు లిరువురు స, మ్మోదంబున నేతదబ్దమున నైనఁ జనం
గాఁదగు శ్రీగిరి కని సుత, తోఁదమ రిట్లనుచుఁ జెప్పదొడఁగిరి పేర్మిన్.

ఉ॥ అమ్మరో! మమ్ము నందఱిఁ గృతార్థులఁ జేయఁగ శ్రీగిరిప్రసా
దమ్మున మాకుఁ గన్య వయి ధాత్రిఁ జనించిన మేల్మి జాళువా
బొమ్మరొ! మమ్ము నే కరణిఁ బూర్ణమనోరథు లట్లు చేసెదో
నమ్మితి మమ్మ! మానివచనంబున నిన్నొకతారకంబు గాన్. ౧౩

కం॥ శ్రీగిరిశిఖరముగాంచుట, చేఁ గలుగును మోక్ష మనుట చేఁ జుమి యేత
ద్భాగతజను లందఱు జన, సాఁగిరి మముఁ గూడఁ బంపు చయ్యనఁ దల్లీ.

గీ॥ కన్య! యస్మత్కుల క్రమాగతము వ్రతము
గొలిచి కుంచెఁడు మనగంగగోవుపాలు
భోగనాథున కనుదినంబును సమర్ప
ణంబుఁ జేయుట యిది యలంఘ్యంబు మనకు. ౧౭

గీ॥ పుత్త్రియుతముగ శ్రీశైలమునకు నత్తు
మనుచు మే మొక్కయెడ మల్లికార్జునునకు
మ్రొక్కికొంటిమి యీమాసమున నె యటకు
నన్న లమ్మయు నేనును నరుగవలయు. ౧౮

గీ॥ ఎత్తుకొనుటకు దించుట కీడుకాని
దాన వతిసుకుమారివి దారి పర్వ
తాటవీవ్యాఘ్రభల్లభయంకరంబు
రాకు మాతోడ మాతల్లి! నీకు మేలు. ౧౯

గీ॥ బొమ్మలను తెచ్చిపెట్టెద మమ్మ! నీకు
భోగవిభునకు నిత్యంబు పూజఁ జేయు
మిల్లు వాకిలి పదిలము తల్లి! గేఫు
పయున మని చెప్ప నిట్లని పలికె బాల. ౨౦

శా॥ అయ్యో! నన్నొక దానినుంచి చనఁగా న్యాయంబె? మీ కియ్యెడన్
నెయ్యం బింతయు నా యెడం దరిగెనే? నేఁ గూఁతురంగానె? మీ
కియ్యాలోచన యేల కల్గెనో కటా! యే నొంటిగా నుండలే
నయ్యా! శ్రీగిరియాత్రఁ జేయఁ దగనయ్యా? నేను మీతోడునన్.

గీ॥ చిన్నదానను భోగేశుసేవఁ జేయు, పాటిదాననె? మిమ్మెడఁ బాసియుండఁ
గలనె? యాపని యితరులవలనఁ గాదె, శ్రీగిరికి రావలదె? నేను జెపుమ తండ్రి!

కం॥ అనవిని తనతనయను గని, కనికరమున నతఁడు పలికెఁ గన్నెలమిన్నా
విను మనవ్రత మితరులు చే, సినఁ జెల్లదు కాన నీకె చెప్పఁగవలసెన్.

గీ॥ కన్నెరో! మాకు నీయెడఁ గరుణ లేక కాదు, నీ వాత్మజాతవు కాక కాదు
మాకు వేరొక తెఱు వేమి లేక కాని, నిన్ను నొకదానినుంతుమే? చిన్నదాని

గీ॥ ప్రితముఁగడ ధర్మములయెడ వదలవలయుఁ
పుత్రమిత్రకళత్రాది మోహమనుట
వలనఁ బ్రేముడిని వదలవలసివచ్చె
నమ్మ నీయెడ మా కాగ్రహంబె? తల్లి! ౨౫

సీ॥ చిఱుతొండభక్తుండు ఛేదించి తనపుత్త్రుమాంసంబుఁ బెట్టఁడే? మాయ
మునికి, పార్థుండు గయరక్షణార్థంబు తన ప్రాణసఖునితో వైరంబు
సలుపలేదె, భర్గాణుఁడియ్యఁడే పడఁతిఁ బతివ్రత జాయగా నాదంభజం
గమునకు, బాపఁడు దనపూజఁ బాడుచేసినతండ్రి పదమును నఱుక
డే? యదయుఁడగుచు.

తే॥ గీ॥ వినుము మనము బరస్పరప్రేమ వదలి
వ్రతముఁ జెల్లించుకొనవలె వారివలెనె
మోక్షమును గాంచవలె నమ్మ! ముద్దుగుమ్మ!
కఱపితిమి మున్నె పూజనక్రమము నీకు. ౨౬

కం॥ అనవినిసుతతప్పదుతన,కనుకొనితలయూఁ చెఁదండ్రియమ్మయుఁదమనె
మ్మనములనిముడనిసంతస,మునఁబొంగుచునిట్టులనిరిపుత్రికకునోగిన్

గీ॥ మఱచితిమి కొన్ని మరుగులు గఱపవలయు
గుఱుతు వచ్చెను విను మమ్మ కోమలాంగి
ప్రిత్తియును వత్తి చేయంగ వలను పడదు
పంకజాతారిమిత్రుల వాసరముల. ౨౭

సీ॥ గన్నేరు దామర కడిమియు సురపొన్న కంకేళిసంపెంగ కలువ మల్లె
నాగకేసరమును నందివర్ధనమును గొండగోగును గలిగొట్టు తుమ్మి
చేమంతి యుమ్మెత్త జిల్లేడు మోదుగ జాజి రేలయు విరజాజి పొన్న
నిత్యమల్లికయు దింటెనయు వాకుడు ముల్క ముల్లుగోరంటయు
మొదలుఁగలుగు.

తే॥ గీ॥ భూజముల పూలె తగినవి పూజ కడవి
మొల్ల మంకెన దిరిశెన మొల్ల మొగలి
కానుగయు దాండ్ర మొదలుగాఁ గలుగువృక్ష
ముల సుమంబులు గూడవు పూజ కెపుడు. ౨౮

సీ॥ మారేడు దులసి కచోరము దవనము మరువంబు జమ్మి దమనము
దేవ, దారేరుమద్దియు నేరేడు సురపొన్నయును దూర్వయును
గుశ లుత్త రేణి, మొదలుగాఁ గలభూజముల పత్త్రములె విహితము
లందుఁ దులసి బిల్వ మధికములు, యలరులలో నల్ల కలువయుఁ గలి
గొట్టు నవము లన్నిటికంటె నాము భక్తి.
తే॥ గీ॥ చిల్లులును గీటకంబులు జీడలేక
కోమలంబులైన దళములఁ గుసుమములను
గోయవలెఁ గోయునెడ నడుగుఁ గదల్చ
కుండగనె సజ్జలోఁ బెట్టుచుండవలయు. ౩౦

గీ॥ పవలుపుష్పించి మొదలుపుష్పములు రాత్రి
పూజ కెన్నండుఁ గూడవు పుత్రి! రేయిఁ
బూచినట్టివి తగవ హరిపూజకొరకు
దాఁచి పూజింప బిల్వంబు తగును సుమ్ము. ౩౧

ఆ॥ వె॥ ఇందువాసరంబునందుఁగోసిన బిల్వ,పత్రములనుదాఁప వలనుపడదు
బోర్ల వేసివీనిఁబూజింపవలెఁదక్క,నట్టిదళసుమములఁబుట్టినటులె.

గీ॥ పూలుఁ బత్త్రిరి బూతియు భోగపత్రికి
సక్రమంబుగఁ బూజింపఁ జనును నప్ర
మాదమున మెలఁగవలయు మాను నమ్మ
నెచ్చెలులతోడ నీయాట నేఁటితోడ. ౩౩

సీ॥ ఉట్టిపైనున్నట్టి చట్టిలోనే మొన్నఁబెట్టితి కలకండఁ బట్టి! గనుము
అటుకులున్న విసుమిఠాయి యాక్రింపఁ బెట్టిన, పిడతలో మాముద్దుబిడ్డ!కొ
నుము, పొన్నారిబుడ్లలోఁ బోసి పెట్టితి నమ్మ! బాలికా! మఱవకు
పంచదార, ఖర్జూరఫలములు గలవు కావలె నన్నఁ గొబ్బరికిని నీకుఁ
గొదవ లేదు.
తే॥ గీ॥ కల్లి! మనయింట గుడమును గలదు కొఱవ
వస్తువుల కేమికొఱఁతమ్మ వనజవదన!
తండ్రి చెప్పినమాటలు దప్పకుండ
నడుచుకొను మమ్మ! భోగేశు నమ్ముమమ్మ! ౩౪

కం॥ ఇటు లాకుటిలశిరోజయు, నిటలాంబక భక్తిఘనుఁడు నెనరునఁ దమచెం
గటనుంచికొనుచుఁ బట్టిని, బటువైఖరి బోధపఱచి ప్రమదముతోడన్

గీ॥ ఇరుగు పొరుగిండ్లవారికి నెఱుకఁజేసి
కన్నెఁగనిపెట్టుఁడని చెప్పి కాఁపు లింట
రేలఁ గాపుండఁజేసి యారేయిఁ గడపి
పగటి కృత్యంబులను దీర్చి పయనమైరి. 3౬

కం॥ అమ్మహీసురమణిమయమకు, టమ్మునకుంగొఱఁతయొశకటమ్ములకుభటా
శ్వమ్ములకున్నడచెదరవి, కొమ్మయుఁగొడుకులును దానుగూడవటంచున్

సీ॥ దర్భాసనంబును దగుమడిసంచియు, బుజముపై నొకత్రాటఁ బొందు
పఱచి, తాళాతపత్రంబు దండంబు నొకచెంబు దగినట్టిరీతి హస్త
ములఁబూని, శిరమున రాంకవోష్ణీషంబుఁ గై సేసి చెవులఁ గుండల
ములఁ జేరఁదీసి, అఁగివస్త్రింబున నవలగ్నము బిగించి పదములఁ
బాదుకొలిపి

గీ॥ యుచితగతిఁ దనయులు తన యుభయపార్శ్వ
ములఁ బురంధ్రియుఁ దనవెన్కఁ గలఁకతోడ
గన్య నేమేమొ చెప్పుచుఁ గాఁగిలించి
నడువఁ బనసల నుడువుచు నడిచె నతఁడు. 3౭

ఉ॥ పచ్చనిమోమునం బసపుపచ్చ మెఱుంగు వెలుంగఁ గుంకుమం
బెచ్చుగ బొట్టుపెట్టి వనజేక్షణ యొక్కతె పూర్ణకుంభముం
దెచ్చుచు మత్తకుంభినిగతిం బ్రకటించుచుఁ దానె ముందుగా
వచ్చెను వారికయ్యెడ శుభంబని మెచ్చిరి పెద్దలందఱున్. 3౯

గీ॥ పొరులను వీడి యంతికోపవనముదరిఁ
బాఱుకాలువ చెంగట వఱలుగున్న
పొన్నసీడఁ దా మొకగడె కన్నెతోడ
నిలిచి యిట్లని పలికిరి నెనరుతొణుక. ౪౦

గీ॥ నీటికడకైన నమ్మరోఁకి తోఁటకడకు
నైన గృహమేధి ప్రియుఁబొంధు ననుగమింప

వలయు నని శాస్త్రి మిందాక నని ప్రవాహ
మిదియె మము వీడు ప్రొద్దు లే దింకమాకు. ౪౧

కం॥ అని తద్వందితులై క, న్యను తగ దీవించి వార లరిగిరి సుతయుం
గనుచూపు మేరవఱకును గనుచుం జనె తిరిగి తిరిగి కలవరపడుచున్.

సీ॥ తనతండ్రి దమకుఁ జెప్పినపాఠములుల్చూచుకొనుశిష్యు లుండెడి కొట్లుఁ
గాంచి, తనయయ్య తత్త్వవేత్తలతోడ సద్గోష్ఠి సలుపుచుండెడి సభా
స్థలముగాంచి, తనయన్న లేవేళఁ దమసహాధ్యాయులతోడ నుండెడి
వితర్దులను గాంచి,తనతల్లి కూర్చుండి తమకు సంతతము సత్కథలఁ జెప్పి
డి దొడ్డిగదులఁ గాంచి.

తే॥ గీ॥ అర్చనాగారమందు దర్భాసనంబు
ను మడిసంచి మామూలుగ నమరి యుండు
తావుల గాంచుఁ దత్తదభావమున మొ
గంబువాంచుఁ జింతించును గన్నె యడలి. ౪౩

సీ॥ ఇట్లు చింతించి చేయున దేమిలేక,
తల్లిదండ్రుల మాటలఁ దలఁచి కొంత
తడవునకుఁ గన్య ధైర్యంబు దానె తెచ్చి
కొనుచు గృహకృత్యములఁ జూచుకొనుచు నుండె. ౪౪

ఉ॥ అంత ననంతరత్నమపరాచలశృంగమునందుఁ జేరి య
త్యంతదృఢానురాగ యగు నంబుజిని న్వీడనాడ నోడి తాఁ
జింతిలుకీతి విన్ననయి చెన్నుఁదొరంగి యహో మహాసము
ద్రాంతరమందుఁ గుంకె వనజాస్యలఁ బాసి మెలంగ శక్యమే. ౪౫

గీ॥ సంజకెంజాయ పడమటిచక్కినమరెఁ, జెలఁగెదట్టమై జగమెల్లఁ జీకువాలు
గాడ్పుతండ్రికిఁజుక్కలుగాంతినొసగెఁజంద్రుఁడుదయించెఁజంద్రికసాంద్రమయ్యె

మ॥ సుమనస్సంఘము పుష్కరస్థలమునన్ సోమోపలోద్భాసి లిం
గము నర్చించి నివాళులిచ్చె నన నక్షత్రంబు లొప్పె న్సుధూఁ
పమునాఁ బొల్చె వియద్వినీలరుచి శుభ్ర త్విట్ప్రభాపూరము
త్తమభూత్యర్చనవోలెఁ దోఁచెఁ జెలగెందద్రక్తి యోగ్యోఘమున్.౪౭

గీ॥ కామినీకుచచక్రము ల్గలియుచుండ
విరహిణీదృక్చకోరము ల్వేగుచుండఁ
గలువజవరాలిమగఁ డెండఁ గాయుచుండఁ
బట్టపగ లాయె నారేయి తుట్టతుదకు. ౪౮

సీ॥ ప్రాచీకుచోజయుపర్వతాభోగసం. భోగసంక్రాంతాంగరాగుఁడగుచుఁ
కుముదినీవక్షోజకుట్మలవిదళన. చాతుర్యవత్కరజాతుఁడగుచు
గగనాంగనాంగసాంగత్యవక్షస్స్రక్. కస్తూరికానైల్య కలితుఁడగుచు
సత్సతీకుల ఘనసారలక్ష్మీసమాహరణోరు వైదుష్యహారియగుచుఁ.
గీ॥ దనివి తీరక వరుణదిక్తరుణిఁ గూడఁ
జనియె గురువరవర్ణిని జారుఁడకట
బాల్యకౌటిల్య మెన్నఁడు వార్ధకమున
నపరిశుద్ధాంతరంగున కణఁగ దెందు. ౪౯

గీ॥ పండువెన్నెల లనియెడి పండుతముల
పాకు లను వేగుఁజుక్కనుపోకఁ జేర్చి
తూర్పుధవళిమ యను సుధతో మెసంగఁ
బరఁగె నరుణాధరం బాచుఁ బ్రాఙ్ముఖంబు. ౫౦

ఉ॥ తమ్ముల సంగడీఁడు కుముదమ్ములకుం బగవాఁడు దేవమా
ర్గమ్మున నుండురత్నము జగమ్ములచుట్టము మూఁకనాల్గువే
సమ్ముల దిట్ట యంధతమసమ్ములపాలిటిముప్పు దూర్పుభా
గమ్మునఁ గాననయ్యెను వికర్తనుఁ డత్తఱి రక్తవర్ణుఁడై. ౫౧

గీ॥ వాసవాశావిశాలాక్షి వరుణదిక్కు
దతికిఁ దరిబంటుచేఁ బంపుతమ్మికెంపు
మెఱుఁగుటద్దంబు నాఁ దూర్పుమెట్టనుండి
వెడలె వినుమానికముఁ జూడ వేడు కయ్యె. ౫౨

గీ॥ వసుసమృద్ధుఁడు సన్మార్గవర్తి వేద
మూర్తియగు సాక్షి మనపూర్వపుణ్యముననె
దొరకె నని పొంగి చేయ గాఁ దొడఁగి రపుడు
ద్విజులు దమతమకర్మము ల్విధియుతముగ. ౫౩

కం॥ పతి దేశాంతరగతుఁడై, నతఁడిం దలయెత్త దెపుడు నవ్వదు కులినా
కృతితోఁ గన నగుఁ బునరా,గతుఁడైనఁ జెలంగు నలిని కడుసాధ్వీబాళా

కం॥ క్షితితలమునఁ గల మదగజ
గతులకుఁ దమపతులతోడఁ గష్టము సుఖముఁ
సత మనుభవించుటయె స
ద్వ్రత మని బోధించురీతిఁ బద్మిని యొప్పెన్. ౫౫

గీ॥ తల్లిదండ్రుల యానతిఁ బిల్ల విహిత
సమయమున లేచి నిత్యకృత్యములు దీర్చి
కాచి కొలిచిన కుంచెఁడు గంగగోవు
పాలుఁబువ్వులుఁ బత్తిరిఁ బండ్లుఁ గూర్చి. ౫౬

గీ॥ మఱియుఁ బూజకుఁ దగు మంచిమంచివస్తు
వులను గొని భోగనాథు దేవళముఁ జేరి
గుడికి ముమ్మాఱు వలఁగొని కోమలాంగి
యుచితగతి గుడిగర్భము నొంది యచట. ౫౭

గీ॥ తండ్రి చెప్పిన పగిదిని దాను భోగ
పతికి నిశ్చలచిత్తయై పరమభక్తిఁ
బూజ సంకల్పపూర్వకముగ నొనర్పఁ
దొడఁగె నీరీతి నధిక సంతోష మమర. ౫౮

సీ॥ ఆవాహనంబు బ్రహ్మాండపిచండున కాసనంబు హృదంబుజాసనునకుఁ,
బాద్యంబు పావనపదపయోజాతున కర్ఘ్యంబు విష్ణునేత్రార్చితునకు
నాచమనీయ మాసేచనకముఖున కవగాహనము మస్తగాపగునకు,
నంబరయుగము దిగంబరునకు జందె మహియజ్ఞసూత్రున కమల
గంధ.

తే॥ గీ॥ మక్షతప్రసవదళము లవ్యయునకు
ధూపదీపము ల్దివ్యస్వరూపకునకు
నాదిమాపోశనము గరుణాంబునిధికిఁ
బాలుఁ బండ్లు నైవేద్యంబు భవహరునకు. ౫౯

కం॥ అని ముందిడి తినునేమో, యని తా నొకకొంతవడికి నారసియాపై
గినకుండె నేమి లోపమొ, యని తల్లడపడుచు నిట్టు లను దేవునకున్

ఉ॥ అక్కట! నా యొనర్చిన సమర్చనలోపమొ? కాక కోపమో?
చక్కఁగ నాఁగకున్నవియొ? చక్కెర చాలక చప్పనైనవో?
ముక్కలి వేఁడి నున్నవియొ? మీఁగడఁ గట్టవొ? లేక నేఁడు పా
ల్దక్కెనొ? తెచ్చునప్పు డెవరేనిఁ గనుంగొని రంచు నెంచితో?

ఉ॥ కోరకుఁ దక్కువైనవియొ? కుంచము పిచ్చయొ? కొల్వనైతినో?
క్షీరఫలాదులందు మనిచిక్కెను నా కని యొక్కఁ? పెట్టనే
నేరనొ? యొల్కిపోయెనొకొ? నీకు రుచించవొ? చాలకున్నవో?
నీరము గూడెనో? క్షుధయె నీకు జనింపదొ? యేమొ? దైవమా.

గీ॥ ఆరగింపవు పాలుఁ బండ్లయ్యొ నాకుఁ
జిన్నతన మాటఁ దెలియక చేసి యుందు
నేర మద్దాని సైరించి నేడుఁ మొదలు
చెప్పి చేయించుకొనుము నాచేతఁ దండ్రి! ౬౩

గీ॥ భోగినాథ! నీ కెన్నఁడుఁ బూజఁ జేసి
యెఱుఁగఁ గరుణించి నా తప్పు లెల్లఁ గాచి
యారగింపుము నైవేద్య మనుచు ముద్ద
రాలు బ్రతిమాలుకొనుఁ గొనఁ డని యెఱుఁగక. ౬౪

కం॥ తనశక్తి నెంత బ్రతిమా, లిన ఫలమొక్కింత యేని లేకుండుటఁ దాఁ
గనుచుండఁ గొనడటంచుం గనుమూసియుఁ గొంతవడికిఁ గన్నియ చూచెన్

కం॥ కను మూసికొనిన నేమో, కొనఁ డే నిచ్చోట నుండఁగూడదు కాఁబో
లునని మదినెంచి తా న, ర్చనదును న్వేరుకడకుఁ జనరాకునికిన్.

కొంత విచారించి.

గీ॥ ఉత్తరాపోశనాదుల కుదకము లివి
యిదియె మేలగు తాంబూల మిదియె మంత్ర
పుష్ప మని చూపి వలగొని మ్రొక్కి నన్ను
నభవ! యెల్లైన దరిఁ జేర్పు మనుచు నరిగి. ౬౭

గీ॥ గోడమఱుఁగునఁ గనకుండఁ గొంతసేపు
నిలిచి కొనియుండు నని యెంచి యెలమిఁ గోరఁ
బట్టుకొని పోవఁ గన్నె రాఁ బాలుఁ బండ్లుఁ
దఱుఁగ కన్నను దిగ్గు లొందె మఱియుఁ బలికె. ౧౮

గీ॥ ఆఁకలియె నీకు లేకున్న నయ్య! యొక్క
గుక్కె డేనియుఁ బాలను గ్రోల దేనిఁ
దక్కగలయవి నేఁ గొందుఁ దప్పకుండ
బండి నెక్కింతుఁ నిన్ను రేపటిదినమున. ౧౯

శా॥ నీకుం గొబ్బరి బెల్ల మన్నఁ బ్రియ మేనిం జెప్పు మా తండ్రి! నే
నీకై దాఁచితిఁ దల్లిదండ్రు లిడినం నీకన్న నాకెవ్వ రీ
లోకం బందున ముఖ్యబంధువులు పాలుంబండ్లుఁ జేకొన్న నే
నీకోరం గొనిపోయి తెచ్చెదను జాగేలయ్య? భోగేశ్వరా. ౨౦

ఉ॥ తల్లియుఁ దండ్రి మీ కిచటఁ దా మొనరించుసమర్చనంబు తీ
రెల్లఁ గ్రమంబునం గఱపి యేగిరి శ్రీగిరి కోయిగట్టురా
యిల్లటపల్లుఁడా! కరుణ నించుక నాయెడ నుంచి పాలుఁ బం
డ్లల్లన నారగించి నను నాఱడిఁ బుచ్చకు మయ్య ముక్కదర.

ఉ॥ తప్పదు నీ కటంచుఁ దలిదండ్రులు సెప్పిన నొప్పుకొంటి నీ
విప్పుడె సం దటంచు నను నేచెద వన్న దెఱుంగనైతి నీ
గొప్పకు నన్నువంటిపసికూనను దిప్పలు వెట్ట న్యాయమా?
పప్పలు దెచ్చి పెట్టెదను బాలును బండ్లును నారగింపుమా. ౨౧

మ॥ కలనూన్నంబులపైని వాంఛ యయినం గానిమ్ము నేఁ బెట్టఁగాఁ
గల మాతండ్రి! యనుగ్రహించి కడువేగం గ్రోలు మీ పాలలోఁ
గలమాధుర్య మొకింత చూడు విడునంగాలేవు మేమింకఁ దేఁ
గలమా? పాలు కృపారసంబున మముం గాపాడుమా? దైవమా.

మ॥ అనుమానించెద వేల? నన్నుఁ గను మాయయ్యా! కటాక్షించి నే
నను మాట ల్విని పాలు పుచ్చుకొనుమా! యమ్మయ్య! నే నేమి చె
ప్పను మానెచ్చెలి కైన నొట్టు వినుమా! పాపంబు నా కేటికిఁ
నను మాతల్లియుఁ దండ్రియుం గసరకుండం జేయుమా! దైవమా!

మ॥ ధనముం గోరను ధాన్యమే నడుగ వస్త్రం బిమ్మనం గాదు తె
మ్మన నీపాలకు నేదియేని బదు లొట్టంచుంటి నింకేమిసా
ధన మీలాగున బాధపెట్టెదవు నాతండ్రీ! విచారింపుమా
ఘనమా? నీకిది కాదు కూడదు సుమా కార్పణ్య మోదైవమా.

మ॥ నను మా నెచ్చెలు లెల్లఁ దె మ్మనుచు నానారీతులం బోరినన్
విన కీవేమి పరిగ్రహింతు వని నే నే దెచ్చితిం దేవ! నీ
కనుకూలం బగు నేనిఁ బుచ్చుకొను కా దన్నన్ వృథా కావు లే
సినుమా! పాలకుఁ బండ్లకుం జెడకుమా! వే యేల యోదైవమా.

మ॥ విసమా! యెంగిలిమాంసమా! సరసమా! వేధింప నీ కింత తా
మసమా! నాపయి నేమి చేసితిఁ గటా! మాటాడ వీ పాలు వె
క్కసమా గ్రోలవు కోర సెత్తుమనెనా? న న్నన్నిట్టితండ్రీ! దయా
రస మావంత గనంగఁ జేసినను సంరక్షింపుమా! దైవమా. ౨౨

గీ॥ ఎంత వేఁడిన నీ కిసుమంత యేనిఁ, గరుణ పుట్టదు నీ దెంతకఠినచిత్త
మకట! నేనేమి చేసితినయ్య! నీకుఁ, బాలు గ్రోలక నన్నేచఁ బాడియగునె.

కం॥ వెలుపల నుండినయాలవెలు, వెలఁదుకతనవారు దనకుఁ బెట్టినపులగం
బెలమిని నీ కిడినను దిని, కులికితి నాపాటికా వెఱ కొను మీపాలన్.

కం॥ జలనిధి మథియించినతఱిఁ, గలజగముల నెల్లనొక్క గడెలోఁ గాల్పన్
హాలహాలము బొడమినఁ గని, చులకఁగ జుఱ్ఱితివి పాలు చొరవా? నీకున్.

గీ॥ తెగుజలములు వోసి తడియార్చి నే నిడు
పాలుఁ బంచదార పండ్లు గూడఁ
బుక్కిలించి యుమిసి మోమోడి ముదుసలి
బోయ యిడినమాంసమునకుఁ బుగడె. ౨౩

గీ॥ ఎత్తిపొడుపుమాటలు దూర నేల యితనిఁ
జూడఁ దలయేరు పోఁకినజాడ దోఁచు
ఫాలమున నగ్గి యుం డగఁ బట్టు శాంతి
దండుగ కె కాని లాభమా! తలఁచి చూడ. ౨౪

సీ॥ ఫాలవహ్నిచేఁ దలయేరు వారకున్న
పౌరు లందఱు పెట్టినపండ్లనాశ

కొలఁదిఁ గడుపార మెక్కినఁ గుట్టు పెరిఁగె
నేమొ! యాతని కనికెమ్మి నిట్టులనియె. ౮౩

శా॥ పాలం గ్రోలవు పండ్లఁ జేకొనవు నేఁ బల్మాఱు ప్రార్థించినన్
మూలం బేమియొ! తోఁచకున్నయది నిర్మూలం బదెల్లాను? దం
టాలం బెట్టక చెప్పు మయ్య! యిఁకఁ జూడం జూడ నేమానొ? నీ
యాలుం బిడ్డలు నూగకుండి రిపు డన్నా! యాపథం బిచ్చెదన్. ౮౪

గీ॥ విషమనిఖిలలోకాధకపేక్షణమున, దృష్టిదోషంబు దాఁకినీతిండిపడెనొ
కాక వేరొండుకలుగునే? కాలకూట, భక్షణా శేషలోకసంరక్షణునకు.

గీ॥ కుక్షి జగములకన్నను గుట్టుగలదె, దృష్టిదోషంబుకన్నను దృష్టిదోష
ముండునే? నీకు నల్లరాగుండువంటి, వాఁడవక్కటికము లేనిపాట్లుగాక.

గీ॥ మోసపోతి నింత మొఱఁబెట్ట నేటికిఁ గారురాత్రిగుండె కాఁడు దేవుఁ
డనుచు వచ్చు నిన్న నాఁడిఁ జేయనే, పాలుగ్రోలకున్నఁ బాఱఁజూడు.

గీ॥ కొండవీట బిచ్చము నెత్తుకొనెడియాది
భిక్షుకా! పాలు బండ్లును వెగటె! నీకు
నడుమ నైశ్వర్య మబ్బినయెడల నుపరి
దృష్టి యుండకపోవుట యెంతమాట. ౮౮

కం॥ అని ఘంటను శంఖంబును
ఘన మగుభస్మంబు సమలగంధాక్షతలున్
గనుఁగొని జంగం బనుకొని
వనజానన వాని కిట్లు పలుకఁదొడంగెన్. ౮౯

గీ॥ కొండవీటిజంగమ! భిక్షకొఱకు నీవు
నిన్న కాక మొన్ననె వచ్చితన్నుఁ జిన్న
దానిఁ దంటాలఁ బెట్టగాఁ దగునెయప్పుడె
నెత్తి కెక్కెనె మాయూరినీరు నీకు. ౯౦

గీ॥ మొన్నవచ్చినజంగము ముసలివాఁడు
మాయలందు దిట్టయు దిగంబరుఁడు గాఁడు
మాయి యయి దిగంబరుఁడయి మంచిరాత్రి
గుండువలె నుండె నీతండు గొండవాఁడు ౯౧

ఉ॥ కుక్కలఁ దోలు నీకొడుకు కొండది నీచెలి యండనుండువాఁ
డెక్కడొ కొండవాండ్రు వధియింపవె? పందిఁ బులి న్గజారి? నీ
వెక్కడికొండనుండి యిటు వేటకి దైవము సంచు వచ్చిన
న్నిక్కులఁ బెట్టనాఁగితివొ? చెప్పు నిజంబు మహాకిరాతుఁడా. ౯౨
ఉ॥ ఇట్టికిరాతవేష మని యించుక నేఁ గన నైతి నయ్యయో!
గట్టిగ నీకరంబులకుఁ గాళ్లకుఁ దప్పక నాగపాశము
ల్గట్టఁగఁ జేసితి గెడ జగంబుల మోసముఁ జేయు నిన్ను నీ
కొట్టునఁ బెట్టియుంతు నిటకుం దలిదండ్రులు వచ్చునంతకున్. ౯౩

న॥ అనిమఱియు

ఉ॥ పాములె భూష లౌచు మెయి భాసిలుచున్నటులున్న నయ్యయో!
పాములసోముఁ డంచు నొకసారి ప్రసిద్ధిగఁ జెప్ప వింటి నా
పాములసోముఁ డేమొ పొరబాటునఁ జెం చని దూఱుచుంటి నా
పాముల నాపయి న్వదలి, పాములఁ బెట్టునొ మోసపోయితిన్.
ఉ॥ పాములపాగఁ జుట్టితివి పాములఁ బెట్టితి వుంగరాలుగాఁ
బాముల పేరు లుంచితివి పాములకంకణము ల్ధరించి తో
పాములసోను నిన్ను బొరబాటునఁ జెం చని దూఱుచుంటి నేఁ
బాములఁ గట్ట నిన్ను ననుఁ బాములఁ బెట్టక నింక నేలుమా ౯౫
గీ॥ అక్కటా! యెట్టు లనుకొన్న నగ్లై తోఁచు
నీశ్వరునిమాయ కాఁబోలు నెఱుఁగ నైతిఁ
బ్రాణముల నైన విడనాడి పాలుఁ బండ్లు
నారగింపఁగఁ జేసెద నని తలంచి. ౯౬
గీ॥ పండ్లకన్నను మాయావు పాలకన్నఁ
బంచదారకన్నను నాదు ప్రాణమందె
తీపిపుట్టెనె నీకు నోదేవ! తీసి
కొనుము నీదెంత గట్టిదో? గుండె తండ్రి! ౯౭
మ॥ అకటా! నీ కొకకొంచె మైన దయ లేదా? నాదుప్రాణంబు నీ
నికటక్షోణిఁ బరిత్యజించెదఁ జుమా! నిక్కంబు నామాట నీ

ఖిఁక నైనఁ బరికించి చూచుకొనుమా! యీపాలకై ఘోరపా
తకముం గట్టుకొనంగ నేటికి? జగద్రక్షా! ననుం గావుమా. ౯౮

వ॥ అని వక్కాణించినను గరుణించక కాంచనధరాధరశరాస
నుం డుపేక్షించిన వీక్షించి యక్కాంచనాంగి తెగించి తదుపకంఠగతకఠిన
శిలాతలంబున నవవికసితకనకబిసప్రసవప్రతిమానంబగు నాత్మీయోత్త
మాంగంబు లాంగలిఫలప్రతిభటంబుగాఁ జేయం గడంగిన. ౯౯

సీ॥ మందస్మితప్రభామంజుళనిజపంచ, వదనపూర్ణేందు బింబములతోడ
వజ్రశూలాభయపరశుఖడ్గోరగ, పాశఘంటాంకుశ ప్రళయ దహన
భాసురనిజపాణిపల్లవములతోడ స్వచ్ఛస్ఫటికవిగ్రహంబుతోడఁ, బం
చదశేక్షణపంకేజములతోడఁ బద్మాసనముతోడఁ బర్వతాధి

తే॥ గీ॥ రాజకన్యకతోడ విరాజమాన
భుజగభూషణములతోడ భోగవిభుఁడు
మెచ్చి సాక్షాత్కరించి మేల్మేలు! కొమరుఁ
బాలుఁబండులు నుడుగు మోబాల! యని యె ౧౦౦

కం॥ అనఁ గని విస్మిత యై య
వ్వనరుహదళనయన భయము భక్తి యుఁ బ్రమదం
బును మనమునఁ బెనఁగొనఁ గర
వనజములను మోడ్చి నిలువఁబడి యున్నతఱిన్ ౧౦౧

క॥ తరుణామృతకిరణశిఖా, భరణుఁడు గరుణారసప్రవాహము పొంగన్
దరసుందరకంధరకుం, బరమామోదంబుతోడఁ బలుకఁ దొడంగెన్.

గీ॥ అరుణుఁ డుదయించినది మొద లన్నపాన
ముల నెఱుంగక వచ్చుచుఁ బోవుచున్న
వారి నెఱుఁగక నడిరేయివఱకుఁ బాలుఁ
బండ్లు గొను మనుచుంటివే బాల! యకట. ౧౦౩

గీ॥ చిన్నతన మైననిశ్చలచిత్త వగుచుఁ
బద్మగర్భాదులకు నైనఁ బట్టువడని
పరశివుని నన్నుఁ బాలకుఁ బండ్ల కిట్లు
బాల! లోఁబడఁజేసితే! మేలు మేలు. ౧౦౪

గీ॥ భక్తి నొసంగితి వీపండ్లుఁ బాలె మాకు
దివ్యఫలదుగ్ధములకన్నఁ దీపి కలవి
యనుచు గిరిరాజకన్యతో నారగించి
భక్తవత్సలుఁ డిట్లని పలికె మరల. ౧౦౭

కం॥ ప్రాకృతనయనాంబుజముల, మాకమనీయాకృతులనుమాటలెచూడం
జేకూరె నదియునీ కిపు, డోకన్నియ! నీదుపున్నె మోహాళో! యనినన్.

కం॥ విని యక్కన్నియ దనమన
మునఁ బొంగుచు నిట్టులనియెఁ బురహర! యిఁకనై
నను నను వేధింపక నీ
వనుదినమును బాలఁ బండ్ల నాస్వాదింతే ౧౦౮

కం॥ అనవిని శివుఁడనుననుదిన, మునుగన్నెరొ! పాలుఁబండ్లుపుచ్చుకొనెదనే
దినదినమగుపడ నన్యుల్, గనుచుండినఁగానటంచుఁ గనరాకుండెన్.

గీ॥ గిన్నె మొదలగువస్తువు ల్గన్నె గొనుచు
నాత్మభవనంబునకుఁ జని హర్షభరిత
యగుచుఁ గృతకృత్యయై యుండె నంతఁ గొంత
వడికిఁ గన్య మేల్కొనె దెల్లవారె నపుడు. ౧౦౯

గీ॥ పౌరు లీవృత్త మాబాలవలన వినుచుఁ
జిత్రభావంబుతోఁ గొంతసేపు గడపి
కన్యఁ గొనియాడుచుండిరి కమలముఖియు
శివుని ననుదినంబును బూజసేయుచుండె. ౧౧౦

కం॥ అస్మత్పెడనపురీశా! సస్మయపురదైత్యహరణ! సామజదనుభూ
ఘస్మర! దహనవిలోకన, భస్మీకృతపంచశర! భవ! యగస్త్యేశా.

కం॥ కేశవనుతపద నత నా, కేశా సూర్యప్రకాశహృదజ్జలరుట్ప్రా
యేశా వస్త్రీకృతస, ర్వాశా యస్మత్పెడనపురాగస్త్యేశా. ౧౧౨

గీ॥ కష్టపడి పెంచుకొనిన నాకవన న్య
నీకు దారవోసితి నయ్య! నెనరుతోడ
నేలుకొను మతిసుకుమారి యెపుడుఁ గష్ట
పెట్టకుము మమ్ము సంతోషపెట్టు మయ్య. ౧౧౩

కం॥ దీనిం జదివిన వినిన మ, హానరులకునిహమునఁబరము నపవర్గము గౌ
రీనాథుఁ డొసఁగుసకలాం,హోనాశనమిట్టి చరితముందు నెఱిమెందుర్.



సీ॥ హారితగోత్రోద్భవుండైన మల్లమహల్లి యతుయగురుఁసకునగ్రిమాత్మ
జుఁడు గణార్చాప్రతస్థుఁడు సాధు వౌ వీరమల్ల యాఖ్యారాధ్య
తల్లజునకు, భ్రమరాంబకుం దనూభవుఁడ విద్వత్సింహాం
డౌరామలింగయ కవరజుండ,మల్లికార్జునుఁడ శ్రీమల్లి
కార్జునకృపాలేశజకవనప్రవేశుఁడ నగు; తే॥ గీ॥ నా
దు భోగేశమాహాత్మ్యనామకకృతి, యందునఁ
దృతీయాశ్వాస మైననిదియు, ముగిసెనాచం
ద్రతారకముగఁ దనర్చు, నట్లుచేయుతఁ
దీనిఁ జంద్రార్ధమౌళి. శ్రీ. శ్రీ.
శ్రీ. శ్రీ. శ్రీ.



# భోగేశ్వరమాహాత్మ్యము.

## చతుర్థాశ్వాసము.

క॥ శ్రీభ్రమరాంబాహృత్ప, ద్మభ్రమణపిచండిలావదాతమహాహాది
వ్యభ్రమరా! చికురోజ్జ్వలి, తాభ్రా! శ్రీశైలమల్లికార్జునలింగా. ౧

గీ॥ అవధరింపుము సర్వజ్ఞ! యఖిలరూప!
విన్నవించెద నాకు నీపేర్మివలనఁ
దోఁచినట్టులుగా గొడగూచికథను
శ్రీబసవపురాణాంబుధిఁ జెలఁగుసుధను. ౨

క॥ ఆభూసురదంపతులు ద
నూభవయుతు లగుచుఁ దమతనూజఁ దలఁచుచున్
వేఁభానుఁ డుండ నొకనగ
రీభూష నలంకరించిరి సుఖం బమరన్. ౩

గీ॥ అంత నారేయి సుఖముగా నచటఁ బుచ్చి
వేకువనె లేచి కృత్యము ల్వేగఁ దీర్చి
కొనుచుఁ దైర్థికులను గూడి కుధరకథల
వినుచు దివ్యస్థలముల సేవించికొనుచు. ౪

గీ॥ పట్టణంబులఁ బల్లెలఁ బర్వతముల
వనుల వాఁకల వాఁగుల వరుస దాఁటి
చేరి త్రిపురాంతకము నందుఁ జెలఁగుచున్న
దేవుఁ ద్రిపురాంతకు భజించి తెరువునఁ జని. ౫

క॥ కొక్కెనజీరునితమ్ముని, నక్కటికముగల్గువేల్పు నభవాత్మభవుం
జుక్కలమలపై వెలసిన, కుక్కనవారుం భజించుకొని దిగి నగమున్

గీ॥ చని యవనిసురుఁ డాలును, దనుభవులును
నంతకంతకుఁ బెరిగెడిసంతసమునఁ
జేరి శిఖరేశ్వరము నందు శ్రీగిరిశిఖ
రంబుఁ గాంచిరి నేత్రపర్వంబుగాఁగ. ౬

కం॥ శివరాత్రి రేపసంగాఁ, గువలయదళనేత్రతోడఁ గొడుకులతోడన్
భవహరము శ్రీగిరీశ్వరు, భవనము విశ్వంభరాసుపర్వుఁడు చేరెన్.
సీ॥ ధూళిదర్శనమును జేయఁ దోయజాస్య
తోడఁ దనయులతో సముత్సుకత మెఱయఁ
గడఁగి తండోపతండములుగా సమాద
రమున నేగెడిభక్తరత్నములతోడ. ౯
సీ॥ ఎట్టకేలకు గుడిఁ జేరి యీశుఁ గాంచి
కరములను మోడ్చి సన్నిధి కరుగుదెంచి
భక్తిపరవశుఁడై యిట్లు బ్రాహ్మణుండు
విన్నవింపఁగఁ దొడఁగె స్వవృత్తమెల్ల. ౧౦
కం॥ స్తంబేరమదనుభవచ, ర్మాంబర! చికురీకృతామృతాంశుకలాస్ని
గ్ధాంబర! భస్మీకృతజిత, శంబర! కరకమలకలితశంబర! శరణుల్.
గీ॥ మాకు మీదివ్యమంగళమంజువిగ్ర
హంబు దర్శింపఁ గలిగినహర్షబాష్ప
పూర మనివార్యమై కన్నులారఁ జూడ
నీయ దస్మదీయాదృష్టమేమొ కాని. ౧౨
గీ॥ దేవ! నేటికి భవదీయదివ్యపదముఁ
గాంచునంతటిభాగ్యంబు గలిగె మాకు
మోక్షలక్ష్మిప్రసన్నకటాక్షవీక్ష
ణైకలక్ష్యత చేకూరె మీకరుణనె. ౧౩
గీ॥ భోగనాథుఁడవై మాకు భోగభాగ్య
ములను గృపచేసితివి పురి మోక్షమొసఁగ
శ్రీమహీధరకల్యాణసీమయందుఁ
గాఁపురంబుంటివేమొ నీకుఁ గరుణ మెండు. ౧౪
గీ॥ వెన్నకంటెను నీమనం బెన్న మృదువు
కన్నతండ్రి! నాకు నీకన్నఁ జనువు
కలుగు దైవంబు దొరకుట కల్ల సుమ్ము
మోక్షమొసఁగుచుఁ గరుణించి ప్రోవు మమ్ము. ౧౫

కం॥ మన్నును మిన్నును నీతిగ, కన్నులు సోమాగ్ని నీరు గాలివి నీవై
యున్నాడ వీవు కానిది, యున్న దె? యెంతైనమమ్ము నోముము తండ్రీ.
గీ॥ సెలవుఁ జేకొని మీపాదజలజసన్ని
ధానమున నొక్కమంటపస్థలమునందు
నిత్యకృత్యంబులను దీర్చి నీమహోప
దానములఁ గొలుచుందుము తనివి తీర. ౧౭
కం॥ కరుణింపుము సర్వేశ్వర! కరుణింపుము కాంచనాద్రికార్ముక! శర్వా!
కరుణింపుము కరుణాకర, కరుణింపుము భుజగరత్నకఙ్కాభరణా. ౧౮
కం॥ అనివిన్నవించుకొని తన
వనితయుఁ గొడుకులును దాను ఘనదుస్సహమౌ
జనసమ్మర్దంబున నిలు
వ నశక్యం బగుట వెడలవలసి వెడలుచుఁ. ౧౯
గీ॥ ఎట్టకేలకు గుడివీడి యెల్లమంట
పములఁ బరికించి యెందును బస దొరకక
యచటియొకగున్నసురపొన్న నాశ్రయించి
మఱచి రాక్రీడవిభ్రమ మందిరమును. ౨౦
గీ॥ మందయానతోడ మహీసురగ్రామణి
సుతులుఁ దాను దేవుఁ జూచి వచ్చు
వఱకుఁ బొద్దు మించెఁ బాతాళగంగకుఁ
బోవ వీలు తప్పిపోయె నపుడు. ౨౧
గీ॥ మల్లికాకుండ పావనమజ్జనంబుఁ
జేసి మధ్యాహ్నకృత్యము లబ్బసురుండు
దీర్చి కూర్చుండి సుతులతోఁ దెఱవతోడ
శ్రీమహీధరమహిమలఁ జెప్పె నిట్టులు. ౨౨
గీ॥ అడుగకున్నను జెప్పఁగానగును జెప్ప
వలసినప్పు డటంచుఁ బెద్దలు వచింతు
రదియునుం గాక మీరు నన్నడుగఁబోవు
నట్టి తోఁచెడినైన నే నాఁగఁ జాల. ౨౩

గీ॥ వినుము నాప్రాణనాయిక! వినుఁడు సుతులు
చెప్పలేరఁట విధిముఖుల్ శ్రీగిరి ప్ర
భావ మెట్లైన నద్దాని నే వచింపఁ
గడఁగినాఁడ మీతోడ నుత్కంఠ మీఱ ౨౪

గీ॥ దురవగాహప్రభావు లౌ తోయజోద్భ
వాదులకుఁ గూడ దుర్వచం బైనశ్రీమ
హీధ్రమాహాత్మ్య మెక్కడ? నే నెక్కడకట!
చపలచిత్తుఁడ మర్త్యుఁడ జడుఁడ ఖలుఁడ. ౨౫

గీ॥ మొసఁగ మెతు కైన లేక దా మేఁడఁగట్టఁ
బెనుఁగులాడెడిబేల యాబీనవలెనె
శ్రీమహీధరమహిమలఁ జెప్పఁబూని
నవ్వఁబడఁగల నుత్కంఠ నన్ను గ్రమ్ముఁగు. ౨౬

గీ॥ ఏమిసేయుదు నెట్లైన నీశ్వరాజ్ఞ
మీఱ నలవియె యదిలేక మొదలఁ గలదె
ధరఁబిపీలిక మొదలు విధాతవఱకు
నతివ! సుతులార! యిది నిజంబండ్రు బుధులు. ౨౭

గీ॥ నవ్వఁబడకుంట పడుట యే నలినసంభ
వాదులకు నాకు నిటఁ గలయట్టిభేద
మెంత వెరవరు లైనను కొంతవఱకె
కాక వర్ణింపఁ జాలిరే? కడకు మహిమ. ౨౮

గీ॥ చెప్పఁగలిగిన లేకున్నఁ జెప్పవలసి
వచ్చె శ్రీశైలమహిమ నాభాగ్య మింక
వశమె? వర్ణింప శ్రీశైలపతిదయాప్రి
భావ మింతకు బీజమై మెపరఁగె భళిర. ౨౯

గీ॥ కాన నాశక్తి కొలఁది శ్రీగ్రావమహిమఁ
జెప్పగాఁదలఁపడితిని జేతఁగాక

యొసఁలు సర్వాంగ నేటికి నుపరి సన్ను
వినుఁడు మీరింక శ్రద్ధతో [illegible]నులార. 30

క॥ శ్రీశైలం బీశైలం, బేశైలంబులును దీనికెనగాఁటజుం
డోశీలవతీ! సుతులా, రా! శైలజతోడ శివుఁడురహిఁ నిందుండున్.

సీ॥ ముప్పదియోజనంబులు వెడలుపు పొడవును యోజనం బెత్తుదన
రు నాల్గు, నలరు మహాద్వారములును బక్షద్వారములు నాలు
గెనిమిది చెలఁగు శృంగ, ములు బదారు గవాక్షములు ప్రతిశిఖర
మం దుండు మూడేసి తీర్థోత్తమములు, శక్తులు లింగము ల్సతకో
టిసాహస్రి, ము ల్పర్శవేదియు భూతిగిరులు.
తే॥ గీ॥ బిల్వవనములు రుద్రాక్షవిటపివనులు
తపనశుభ్రాంశుతారకాతాళవనులు
దివ్యసంజీవినులును జ్యోతిష్మతులును
సమరు శ్రీగిరి నంభోరుహాక్షులార! 3౨

గీ॥ ప్రాచిఁ ద్రిపురాంతకం బుండు వజ్రి యందుఁ
జెలఁగు వైడూర్యమణిమయశిఖర మందుఁ
దీర్థము లఘణియును భారతియును జారు
ఘోష యనునవి నయ్యెడఁ గొలుచుండు. 33

గీ॥ ఎసఁగు ననలాశ స్కందసోమేశ్వరంబు
చెలఁగు గుహయుఁ డందు రౌప్యంబు శృంగ మందు
నలరుచుండు విచిత్ర జాహ్నవియుఁ దామ్ర
యనెడి తీర్థంబు లంభోరుహాస్యలార! 3౪

గీ॥ దక్షిణద్వార మొప్పు సిద్ధవట మటనె
పుష్పశైలంబు సిద్ధకింపురుషముఖులు
జెలఁగుచుందురు విద్రుమశృంగ మందు
శుక్లయును క్షేమ యుత్సవ సొబగుమీరు. 3౫

గీ॥ నిఋతిదిశ నహోబల మన నెగడునచట
మాధవుఁ డుండు శిఖరంబు మారకతము

గోమతియు మంగళయుఁ గీర్తి కులుకుచుండు
తీర్థరత్నంబు లయ్యెడఁ దేజరిలుచు. ౩౭

గీ॥ ప్రబలుఁ బడమర బ్రహ్మేశ్వరంబు విధి వ
సించు నచ్చట హరినీలశిఖర ముండు
భద్రయును విపులయు రమ్య పరగుచుండు
తీర్థరాజంబు లచ్చోటఁ దేజరిలుచు.

గీ॥ అనిలకోణంబునం దుండునదియె నంది
మండలం బందు నందీశుఁ డుండు వజ్ర
మయము శిఖరము జయయు విజయయు జ్యోతి
యనెడితీర్థంబు లయ్యెడ నమరియుండు. ౩౮

గీ॥ ఉత్తరమున మాహేశ్వర మూర్వశీము
ఖాప్సరోవాసము మణిమయశిఖరంబు
నలరు నర్చిష్మతీపృథువులును వక్ర
యనెడి తీర్థంబు లందుఁ జంద్రాస్యలారా! ౩౯

గీ॥ ఎనయు నీశాన్యమందు నేలేశ్వరమున
నీశ్వరుండుండు రౌక్మంబు శృంగ మందు
నెగడు నానందియును నందినియును శుక్ల
యనెడి తీర్థంబు లభిలషితార్థదములు. ౪౦

కం॥ ఏయేసమయంబులయం, దేయేవిధి నున్న మిగులవ్రాద్రంజనమా
నాయావిధముల నుండెడి, నీయాతీర్థస్థజలము లీక్షించినచో.

వ॥ కార్తికంబున వాజపేయసహస్రఫలంబును మార్గశీర్షంబునఁ బౌండరీకఫలంబును బుష్యంబున నతిరాత్రఫలంబును మాఘంబున రాజసూయఫలంబును ఫాల్గునంబున సౌత్రామణిఫలంబును చైత్రంబున ద్వాదశాహఫలంబును వైశాఖంబున లక్షగోదానఫలంబును జ్యేష్ఠంబునఁ దప్తకాంచనాభరణాలంకృతలక్షగోదానఫలంబును ఆషాఢంబున సస్యయుక్తయోజనాయతోత్తమభూదానఫలంబును శ్రావణంబున స్వర్ణకోటిదానఫలంబును భాద్రపదమున సవత్సకపిలగోకోటిదానఫలంబును ఆశ్వినమున సహస్రకన్యాదానఫలంబును సంక్రాంతిపర్వసూర్యచంద్రోప

రాగభానుసోమవాసరంబుల నిరంతరసకలసత్కర్మవిధివదాచరణఫలం
బును శ్రీగిరిసందర్శనంబున సిద్ధింపంగలవు మఱియు

కం॥ సురసిద్ధసాధ్యవిద్యా, ధరకిన్నరయక్షగరుడదంపతులీభూ
ధరశిఖరపుష్పవనకం,దరలం గ్రీడింతు రెపుడుఁ దద్దయు వేడ్కన్.

కం॥ ఇమ్మహీధరమునఁ గలవృ, క్షమ్ముల లతలం గిరులం గల వట కడుచి
త్రమ్ముగ నూటాడునవియు, దిమ్మరునవివాటికథలఁ దెలిపెదవినుడీ.

మ॥ ఒకవిప్రుండు కుటుంబయుక్తముగ నీయుర్వీధ్రయాత్రార్థము
త్సుకత న్వచ్చి సుశీతలాధరతలక్ష్మోణీజముం జేరి వే
రొకవృక్షమ్మున కేగి పత్రములఁ దెమ్మాడింభకా! యంచు దా
రకునిం బంపిన నాతఁ డేగి యొకచిత్రంబైనచెట్టెక్కినన్, ౪౬

గీ॥ చెట్టు నడువసాగెఁ జిత్రంబుఁ జూచుచు
బ్రాహ్మణాత్మజుండు పత్రములను
గోయుచుండె నింకఁ గోడు కేలరాఁడొకో!
యనుచుఁ దల్లిదండ్రు లడలి రంత. ౪౭

గీ॥ వెతకి వెతకి వనుల వేసారి పుత్రునిఁ [అవ్విప్రుండు
గానలేక మనము గలఁకఁ బాఱ
మోక్షమునకుఁ బుత్రిమోక్షంబు బదులుగా
వచ్చెనే! యటంచు వగచి వగచి. ౪౮

మ॥ పులియో! భూతమొ! పుత్రుఁ బత్రములకై పోమ్మంచుఁ గోల్పోయి వి
హ్వలభావంబున నుండగావలసె నాహా దైవమా! యంచుఁ గ
న్నుల నీరేఱులు గట్టి పాఱ గిరిసందోహంబు ఘోషింప బె
గ్గిలుచుం బిల్లలకై పురంబునకు నేగెం గాంతతో నేడ్చుచున్. ౪౯

గీ॥ క్షుత్పిపాసలు లేక నాక్షోణిసురసు
తుండు నాకులఁ గోయుచు నుండ నిచట
వత్సరం బాయెఁ ద్రుటి యయ్యె వాని కచట
మఱల నేతెంచి యాత్రకు మహీసురుండు. ౫౦

గీ॥ మున్ను దామప్డు బసఁ జేసి చిన్నవానిఁ
గోలుపోయినచెట్టును గుండె జల్లు

మసఁగ నీక్షించి హా!శివా! యనుచు నచటి
కరఁగి యిట్లని తద్దయు నంగలార్చు. ౫౧

సీ॥ తోడిపిల్లలతోడ నాడఁబోకుమటంచు,నిర్బంధనముఁ జేయు నిర్దయాత్ముఁ
జేయకుందువె యని చీటికి మాటికిఁ బను లెల్లఁ జెప్పెడి పాపకర్ముఁ
గన్నెఱ్ఱఁ జేసి ఛీ తిన్నగాఁ జదువ వేమంచు దండనఁ జేయునట్టి కోపిఁ
జిన్నవానిని నిన్నుఁ జెట్టెక్కఁ బనిచియీసురపొన్న నీడఁ గూర్చున్న కఠిను
తే॥ గీ॥ నన్నుఁ జూడరా దని దాఁగియున్న మేము
బ్రతుకఁ గల మయ్య మాముద్దుపట్టి! నిన్నుఁ
బట్టి కద మాకు సద్గతి ప్రాప్త మగును
గానఁబడు మయ్య! కన్నులకఱ్వ దీఱ. ౫౨

గీ॥ అనుచు విలపించుచుండ నయ్యవనిరుహము
చిఱుతపుడమివేలుపుతోడఁ జెలమిఁ జేసి
నట్టిచోటున కే తేర నతఁడు వేగ
నాకులను గోసికొనివచ్చె నయ్యకడకు. ౫౩

గీ॥ పుత్రు నీక్షించి విస్మయాంభోధిలోన
మునిఁగి విప్రుండు సంభ్రమమునఁ దదీయ
మూర్ధ మాఘ్రాణ మొనరించి పుత్రుతోడఁ
బట్టణముఁ జేరె నాశ్చర్యపడిరి ప్రజలు ౫౪

కం॥ ఇచ్చటివిజనస్థలముల, నచ్చరలేమలను గూడి యమరులు మిగులన్
విచ్చలవిడి గ్రీడించుచు,నచ్చెరు వొందుదురు భూరుహాలాపములన్.

గీ॥ భూతిగిరులును రుద్రాక్షభూజవనులు
గృతకభూమీధరంబులు గేళివనులుఁ
గాఁగఁ జిత్రంబులను జూచి కరము సంత
సించుచుందురు సాధకు ల్శ్రీనగమున. ౫౬

సీ॥ ఒకయౌషధిని గొని యొరులకుఁ గనరాక, చిత్రింబులను జూచి చె
లఁగుధన్యు, లింకొకయౌషధి నెఱిఁగి కన్పడనివస్తువు లెల్లఁ గాంచెడి
సుకృతవంతు, లెనసి వేరొకయౌషధిని గామగమనులై యెల్లలోకం

బుల కేగుచునులు, మఱియొకయోషధిమహిమచే వాయ్వగ్ని సలిల
సంస్తంభనము ల్సల్పుదురు;
తే॥ గీ॥ లబ్జముఖులార! యీయద్రియందుఁ జెలఁగు
చుందు రయ్యావి యిచ్చోట నుండు కతన
నేమి చెప్పుదునే నింక నిన్ని మహిమ
లెందుఁ గానరా వీయద్రియందె కాని. ౫౯
క॥ ఈపగిదిని శివదేవుఁడు, శ్రీపర్వతమహిమను దన చెలికి సుతులకున్
జూపించుచుండఁగఁ బ్రీతిఁ, జీపర్వతమునకుఁ దమ్మి చెలికాఁ డేగెన్.
క॥ అంతట శివదేవుఁడుఁ దన, కాంతయుఁ గొడుకులును మల్లికాకుండకబం
ధాంతరమున సాంధ్యంబుల, సంతసముసఁ దీర్చి జనిరి స్వామి న్గొలువన్.
గీ॥ ప్రబలెఁ జీఁకటి దీపికాప్రభలు బలిసె
విచ్చెఁ గలువలు మల్లెలు విరిసె నలరు
విల్తుఁ డసహాయశూరుఁడై విన్ను ముట్టెఁ
బాంథజనములు గుండెలు బ్రద్దలయ్యె. ౬౦
గీ॥ అభవుకల్యాణ మెల్లి యౌ ననుచు సమయ
మంబరంబున నల్లభం బమరఁ దీర్చి
గ్రుచ్చి కూర్చిన ముత్యాలగుత్తు లనఁగ
నెగడెఁ దఱచుగఁ దారకానివహ మప్పుడు. ౬౧
క॥ ఆడిరి యచ్చరలేమలు, పాడిరి గంధర్వసతులు భక్తజనంబు
ల్వేఁడిరి ముక్తుల నిడఁగొని, యాడిరి సురలెల్ల మల్లికార్జునునిఁదగన్.
క॥ ఆటలఁ బాటల గోటుల, నీటుల లో టుండ నీక నిర్జరకాంతా
కోటులతో పాటుగ ధన, పాటలగంధులు దనిపిరి పరమేశ్వరునిన్.
గీ॥ ఈశ! నీ కింకఁ గానరా దేను! కాని
గానఁ బడ కుంట పడుటయే కాక వేరె
కలదె భేదంబు సురనరకామినులకు?
గాననాట్యాభినయరూపకళల నరయ. ౬౪
గీ॥ మల్లికార్జును సేవించి మహిసురుఁడు మ
హోత్సవావసానమున మహోత్పలాక్షి

తోడఁదనయులతోడ సంతోషపార
వశ్యమున వచ్చి బసలోనఁ బవ్వళించె. ౬౫

వ॥ అంతఁ గొంతవడికి.

గీ॥ వసుసమన్వితుఁ డినుఁ డిట వచ్చు నిపుడ
టంచుఁ బ్రాగ్ద్వారవనిత తా నపుడు నుదుట
దిద్ది తీర్చిన కస్తూరితిలక మనఁగఁ
జుక్క పొడిచెను దూరుపుదిక్కునందు. ౬౬

గీ॥ కువలయేశుఁడు సిరిపోవఁ గొంకి మూడు
కళలతో ముందుగాఁ దనకడకుఁ జేరఁ
బూర్వదిగ్ద్వారకామిని మునుపటియను
రాగ మూనదు ధనమె కా!భోగసతికి. ౬౭

గీ॥ పద్మబాంధవ్రుఁ బొడఁ గాంచి పౌరుహూతి
లోన నున్నదియో లేదొ లోక మెల్ల
ముంచు రాగంబుఁ జూపె నే తెంచురవికి
వలచు వసువృద్ధి కల్గుచో వార కాంత. ౬౮

గీ॥ తనకు ముందుగఁ బ్రాచితోఁ దగుదు నంచు
సంగమముఁ జేయువాఁడె యీాతఁడి కళంకి
గురుకళత్రోపపతి యను కోపముననొ
యెఱ్ఱవారిన మెయితోడ నినుఁడు పొడిచె. ౬౯

గీ॥ ప్రాచి కళలను గొని కానరాక చనుమ
టంచు రేరాజుఁ బంపితా నబ్జబంధు
గౌరవించెఁ బ్రసన్నతఁ గాంచునటులు
వెలవెలందుక లింతె కా! వృద్ధ నరము. ౭౦

గీ॥ పద్మినీదివాసంగమపాపకర్మఁ
గానరా దని కుముదిని కనులమూసి
కొనెనొ? నా ముకుళించెఁ బద్మిని చెలంగ
పతికిఁ బతిభక్తియే పుణ్యసాధనంబు. ౭౧

కం॥ అంబరమణి తన వేయిక, రంబుల వేవేగ పుష్కరంబున నుడుపు
ష్పంబులఁ గోసెననియొ పు,ష్పంబులకై ధరణినపుడుపరువిడిరి జనుల్.
గీ॥ చుక్క వొడిచినయపుడె భూసురుఁడు లేచి
తన్వియును దానుఁ గొడుకులు దైర్థికులను
గూడి పాతాళగంగకు గొబ్బునఁ జని
కాంచి ప్రణమించి మించి నుతించి రిట్లు. 23
కం॥ గంగా! త్వన్మంగళదత, రంగంబులఁ గ్రుంకువారు రాజార్ధధరా
భంగురకృప సంసారత, రంగములమునుంగరనుటరాద్ధాంత మగుః.
కం॥ రంగారు తావకీనత, రంగావళుల న్మునుంగరాఁగడఁగుచు నుం
డం గాల మేగె నేడై, నంగాని మునుంగఁగల్గినారము గంగా! 24
కం॥ గంగాభుజంగమస్తక, రంగంబున నాట్య మాడ రా రమ్మనభో
గంగకుఁ దోడగు ముద్య, ద్భంగా పాతాళగంగ! పాతకభంగా. 25
కం॥ రార మ్మని మేముబలా, త్కారమ్మననిన్నుఁబట్టి గరగళునిజటా
భారమ్మున నిడ నేటికి, వే ర మ్మిక లెమ్ము గంగ! విపులతరంగా
కం॥ సాంగముగాఁ బ్రభవించిన, శృంగారరసంబనంగఁ జెల్లెడి నీమూ
ర్తిం గామజేత కిడకు, న్నం గానంగాయు జ్యోత్స్న నానగుగంగా!
కం॥ పోలయలుక నీకుఁదగదా,యలికాక్షునికడకు వేగ ననురాగముతోఁ
గులుకుచునంచనడల రా,గలిగిన మేమతనితోడఁగలిపెదము సుమీ.
కం॥ ఒడయఁడగు మల్లికార్జును,నెడఁబాసికడున్వడిఁబరువిడుట నెయిటుల
న్నుడిఁ బడితి వధోగతిఁ బడి, వడిగలతనమింతవఱకువచ్చెనె గంగా.
కం॥ తడఁబడెదవేలమాతోఁ, దడయక వేంచేయుమతనిఁదలని న్నిడున
ట్లొడఁబఱతుమనుచునుడువుచు,వడివడిఁగృత్యములఁదీర్చివారలుపిదపః.
సీ॥ స్నానసంధ్యాద్యనుష్ఠానంబులను దీర్చి తడియార్చి పట్టవస్త్రముల
దాల్చి,పాతాళగంగలోఁ బానీయముల నించి తగినకుంభముల హస్త
ముల నుంచి, పూచినపూజార్హపుష్పంబులను జేర్చి రమణీయబిల్వ
పత్రములఁ గూర్చి, పరిపాకమధురరం భాఫలంబులఁ బూనిగంధక
ర్పూరాదికంబు లూని.

తే॥ గీ॥ భస్మకాశ్మీర రేఖావిభాసమాను
లగుచుఁ బాతాళగంగకు సాదరమునఁ
బ్రణతిపూర్వకముగఁ బ్రదక్షిణము లొసఁగి
మల్లికార్జును సేవింప మరలి రపుడు. ౮౩

మ॥ నడుమన్గన్పడులింగమూర్తుల మహానందంబుతోఁ గొల్చుచుం
బడి రమ్యంచు మదించునంచ నడల న్వాంఛించువాల్గంటితోఁ
గొడుకు ల్దాను వచించుచున్ భవహరున్ గోష్ఠిం బ్రశంసించుచు
న్గుడి కేతెంచి యథావిధానముగ మ్రొక్కు ల్దీర్చి వా రాదటన్.

సీ॥ చూచి రాఁదగుతీర్థము ల్చూడ నేగి
మగుడి మాధ్యాహ్నికమునకు మల్లికాఖ్య
కుండమును జేరి తటి నించ కుండఁ గృత్య
ములను నెఱవేర్చుకొని సుఖాస్న కరిగి. ౮౪

గీ॥ అచట నీడఁ గూర్చుండ నయ్యావనిసురుని
కాంత యీ మల యస్నింటికెంతొ నింత
మహిమ నెట్టు లార్జించె నేమాన్యునకు జ
నించె నద్దానిఁ గరుణింపు డంచు వేఁడ. ౮౫

మ॥ శివదేవుండు వచింపఁగాఁ దొడఁగె "నో శీతాంశుబింబాస్య! యీ
య్యావని న్మన్న శిలాదుఁ డన్మునివరుం డత్యుగ్రరీతిం దపం
బవనీస్థండనుఁ గూర్చి చేసె శతకోట్యబ్దంబు లేమచ్చిలా
భ్యవహారుం డయి కాంతిఁ దప్పి శశిసప్తాశ్వాగ్ను లూటాడఁగన్.

ఉ॥ ఆతప మద్రిజేశ్మయదయోగనవర్షుకమేఘమై సము
ద్ధూతరజస్తమస్కు మయి లోపితలోకకదంబకంబు నై
"యీతపమింకఁ జాలు వర మియ్యఁగ వచ్చితి నో శిలాద నీ
కే తగు యోగవైభవసమృద్ధి" యనెన్ స్తనితార్భటిన్ రహిన్. ౮౭

మ॥ అనిన న్గన్నులు విప్పి చూచె గిరికన్యాభాగధేయుం గన
ద్ఘనరత్నోరగభూషణున్ గగనగంగామాలికాంచత్కప
ర్దుని శీతాంశుకలాకిరీటు వృషభారూఢుం ద్రిశూలి న్నతా
వనుఁ గారుణ్యపయోనిధి న్గణపరీవారు న్శివు న్శంకరున్. ౮౮

గీ॥ చూచి వే లేచి సాష్టాంగ మాచరించి
వినుతిపూర్వకముగ జగద్వినుత! తావ
కాంఘ్రిసరసిజభక్తిరసానుభవప
రాయణుల సుతుల నిరువుర నిడు మనిన. ౮౯

చం॥ కరుణ నయోనిసంభవుఁ గాయజగర్వఘటామృగేంద్రులం
బరమపవిత్రుల న్సహజభక్తుల నిర్వుర నిచ్చె నందికే
శ్వరుఁడనువానిఁ బర్వతునిఁ జక్కనిపుత్రులుగా నుమామనో
హరుఁడు శిలాదుఁడు న్ముదితుఁడయ్యె సదృశ్యతఁ జెందె నీశుఁడుᳲ.

ఉ॥ అంత శిలాదసంయమియు నాత్మజులం గొని ముద్దులాడుచు
సంతస మొందుచుం దసవిశాలవిలోచన కిచ్చి పెంచు మ
న్నంతఁ, బయోధరంబులకు సార్థత గల్గెను వింత యంచు న
క్కాంత యు సంభ్రమంబునఁ దగ న్గొని పెంచుచునుండె నర్మిలిᳲ.

కం॥ నందీశ్వరుఁడును బర్వతుఁ, డిందూత్తంసుని కటాక్షవీక్షణమున లే
చందురులపోల్కి జగదా, నందప్రదు లై పెరిఁగిరి నానాఁటి కొగిᳲ.

కం॥ నానాఁటికిఁ బెరిఁగెడి యా,మానితనూభవుల భక్తిమహిమవచింపం
గా నగునె నలువ కైనను, వేవేళ్ల న్నుడువుభుజగవిభునకు నైనᳲ.

చం॥ నిరుపమభక్తి నీశు మది నిల్పి తపం బొనరంగఁ జేయ సాఁ
గిరి మునిపుత్రు లిర్వురును గీర్తితనైజచరిత్రు లౌచుఁ గి
న్నరగరుడోరగామరగణంబులు నచ్చెరువంద మానిశే
ఖరు లహాహా! యనం జనకుకై వడిఁ దాము ననేకకల్పముల్. ౯౪

గీ॥ ఇట్లు దప మాచరించు మునీశసుతుల
కభవుఁ డర్ధేందుమౌళి వామార్ధజాని
మెచ్చి «నే మీకు వరము లీవచ్చినాడ
వేఁడుకొనుఁ" డన నబ్బింబుతోడ వారు. ౯౫

సీ॥ లేచిసాష్టాంగంబులాచరించివినతు,లొనరించివృషభత్వ మొసఁగి దేవ
నను వాహనముఁ జేసికొను మని నందియుఁబర్వతాకృతి నిచ్చి
పాయ కెపుడు, నాశిఖరాగ్రఁబునం లింగరూపంబుతో నిల్వు మని

పర్వతుండు వేఁడి,రీశుఁడావరముల నిచ్చి వెండియు వరంబులు గోరు
కొనుఁడన నలరి నంది;

తే॥ ప్రమథనాయకసర్వజ్ఞభావములను
పర్వతుఁడు సర్వపుణ్యపర్వతసరిన్మ
హాస్థలాత్మాధివాసంబు నాత్మశిఖర
దర్శనంబున మోక్షు మందఱికి వేఁడ. ౯౬

గీ॥ అభవుఁ డపుడు వారి కడిగినవరములఁ
గరుణ నొసఁగి వృషభగమనుఁ డగుచు
లింగరూపమున వెలుంగుచు నిట నుండుఁ
గాన నింత మహిమ కలిగె గిరికి. ౯౭

చం॥ అనవుడు వారు మోదరస మత్యధికంబుగ సంకురించి న
మ్మనముల నిండి దృక్కమలమార్గములం బ్రమదాశ్రుకైతవం
బున వెడలన్ శరీరములు పొంగి వెలుంగఁగ శ్రీధరాధరేం
ద్రునికథలందె రక్తులయి స్తోత్రముఁ జేసిరి పర్వతేశ్వరున్. ౯౮

గీ॥ వారిలో గుణనిధి యను బాలుఁ డంత
నయ్య! యీగిరి శ్రీగిరి యగుట కెద్ది
కారణము యానతిం డనఁ గరుణ నతఁడు
వలుకఁ దొడఁగెను సుతులతో వనితతోడ. ౯౯

చం॥ వసుమతిపేర నొక్కమునివర్యునిపుత్త్రి ధరిత్రి నొప్పు నా
బిసరుహపత్త్రనేత్ర కడుఁ బెద్దతపంబొనరింపఁ బ్రీతుఁడై
బిసరుహసూతి కానఁబడి వేఁడిన నేవర మైననీకు నే
నొసఁగుదు నన్న శ్రీ యనెడి యుత్తమనామము వేఁడె వేఁడినన్.

క॥ సరసీరుహసంభవుఁ డా,వర మిడి యంతర్థి నొందెఁ బాయక శ్రీ యీ
గిరిపై నీశుం గొలుచుచుఁ,బరఁగుట శ్రీగిరి యననిదిప్రథితంబయ్యెన్.

చం॥ అన విని వారు సంతసిలి రంత యశోధననామకాత్మజుం
డనఘ! గిరీంద్రుసత్కథల నంటెసనెమ్మన మింక నన్యమున్
వినఁ దలపోయునయ్య? పృథివీధరలింగము మల్లికార్జునా
ఖ్య నలర నద్రిజాత భ్రమరాంబిక కాఁ గత మేమి నావుడున్.

మ॥ శివదేవుండు వచింపఁగాఁ దొడఁగె నీశ్రీశైలమం దుత్తమాం
దవపాషాణమయోరుసౌధనికరోద్యత్కాంతిచంద్రప్రభా
భ్యవహారాతురతాచరన్నిఖిలజీవంజీవ మా చంద్రగు
ప్తవిభూత్వంసునిపత్తనం బవని నత్యంతోన్నతిం జెల్వగున్. ౧౦౩

ఉ॥ ఆపురిఁ జంద్రగుప్తుఁ డనురాధిపుఁ డాత్రిదివంబునుం బలెం
గాఁపురముండె నాతనికిఁ గన్నియ యొర్తు జగత్త్రయీజయ
శ్రీపరనామధేయ కలశీస్తని చారుచకోరనేత్ర రా
కాపతివక్త్ర చంద్రవతి గానకలాపరవాణి యై తగున్. ౧౦౪

శా॥ నేనే కూఁతు వరించి యెల్లరమహానిందం గ్రహింపంగ నే
లా నే నీని సుతావిమోహమున దూలం జేసినం గొంత మే
లౌ నేమో యని చంద్రగుప్తునకు భాషాధీశుఁ డత్యంతశో
భానిస్స్వామ్య ఘటించెఁ గూఁతునని చెప్పం జెల్లు వేయేటికిన్. ౧౦౫

గీ॥ అంగజుఁడుఁ జంద్రగుప్తున కాత్మజాత
పైని మోహంబు లెస్సగాఁ బాదుకొలిపె
నన్నకే కూఁతుఁ గూర్చినయట్టికూళ
కితరు నీతని వంచించు టేమి వింత. ౧౦౬

గీ॥ ఎంతసౌందర్యవతి గాని యెచ్చటైనఁ
బుత్రి మోహించు ఘోరపాపుండు గలఁడె
చంద్రగుప్తునంతటిబుద్ధిశాలియుఁ గటా!
పుత్రి మోహించె విధివశంబునకు నడ్డె. ౧౦౭

వ॥ ఇట్లు చంద్రగుప్తుండు మన్మథోత్పాదితనిజపుత్రీవ్యామోహపరవశుఁడై పుష్పవనంబున కరిగి యచటియొకసరసిదరి నున్న క్రొన్నెలఱాతిన్నెపయిం గూర్చుండి యక్కన్నెమిన్న పొందునకుం దగునుపాయంబుఁ జింతించు చుండె. ౧౦౮

ఉ॥ అంతట వృద్ధుఁడైనజలజాప్తుఁ డదెట్టులొ చంద్రగుప్తవృ
త్తాంత మెఱింగి కూడ దిది యంచు మహాగ్రహ మూని శోకిమా
క్రాంతనిజాంగుఁడౌచు నుడుగం డని తోఁచియొ పశ్చిమాద్రివ
న్యాంతరసీమకుం జనియె నట్టివెయాఁ గద! సత్ప్రవర్తనల్. ౧౦౯

గీ॥ అరుణకిరణుండు దా నేగునప్పుడు వహ్ని
కిడిన తేజంబొ యహీనతుల్ గడలి నోలఁ
లాడు నెడఁ బడగలపయి నమరుమణుల
చాయలో యన సంజకెంజాయ లలరె. ౧౧౦

గీ॥ మరుఁడు గాల్పంగ విరహులమదుల మొదలఁ
విరహవహ్ని కణంబులఁ బెట్టి వీవఁ
బొడమి జగ మెల్ల నలముక్రొంబొగ లనంగఁ
గటికచీఁకటి దిశలఁ బిక్కటిలె నపుడు. ౧౧౧

గీ॥ జలజము లణంగి యున్నను జారచోర
వదనజలజముల్ చెలరేఁగి వఱల దొడఁగె
రాజు వచ్చినఁ గాని యారాట మెల్ల
నణఁగియుండవుకదా యవి యవనియందు. ౧౧౨

గీ॥ వెన్నె లనుపిండి జల్లింప మున్న వెలఁది
పూర్వపశ్చిమగిరికరముల నమర్పఁ
జెలఁగుచద లనుజల్లెడచిల్లు లనఁగఁ
జుక్క లగుపడె నయ్యెడఁ జూపఱకును. ౧౧౩

ఉ॥ మారుఁడు పాంథకోటి బరిమార్పఁ దమోస్త్రము నేసి తారకా
ఘోరశిలీముఖంబులను గుప్పి కసిం బడబానలంబుతోఁ
దారిచివేయు నగ్నికణదారుణలోహితచక్రమో యనం
దూరుపుఁగొండపైపైఁ దొలుదొల్తఁ గళానిధి తోఁచె నంతయున్.

సీ॥ వియదాపగాజలవిహరణోత్కంఠాసమాయాతమదకలహంసవరము
మలయమారుతసముచ్ఛలితఘనాంశుకస్ఫుట పూర్వదిక్కుచపూర్ణఘ
టము, సమయకైవర్తపుష్కరమార్గనీయమానోద్గ్రీవంగ్రమణిరాజతో
డుపంబు, శర్వరీధ్వాంతకజ్జలసముజ్జ్వల వజ్రరత్నవృత్తమహాకరండ
కంబు;

గీ॥ గగనలక్ష్మీకర గ్రహకలితలలిత
తారకాకరదీపికోత్సవసమయస

ముద్ధృతానల్పచంద్రమోజ్యోతి యనఁగఁ
జంద్రుఁ డొప్పారెఁ దచ్ఛిలల్ జలము లూరె. ౧౧౭

ఉ॥ యోగులు సంతసిల్లిరి వియోగులుఁ దూలిరి భీకరాటవీ
భాగము దూరెఁ జీఁకటి సభాసద యయ్యెను జ్యోత్స్న యబ్ధి భూ
భాగము పట్టకుండె నలపద్మశరుండును హెచ్చెఁ దారకా
పూగము చిన్నబోయెఁ దొపబోడుల పోడిమి మించె నత్తఱిన్.

వ॥ చంద్రగుప్తుండు స్వసంతాపకరుండగు పూర్ణసోము నుపాలం
భింపందొడంగె నిట్లనిన. ౧౧౮

గీ॥ శుభము సౌమ్యునిఁగాఁ బూర్ణసోమ! నిన్ను
సకలజను లాడ సమ్మతి నకట! కల్ల
క్రూరుఁడ వశుభదుఁడ వని కుటిలుఁడ వని
తేటపడె మేలు నాకు నీ నాఁటికైన. ౧౧౯

కం॥ నమ్మించి గురుక్షేత్రము, వమ్ముగఁ జెడఁగొట్టినట్టి పాపివి నీ దే
హమ్మునఁ బాయక క్షయరో,గమ్మిఁక బాధింపకున్నె ఖల! యోసోమా

గీ॥ ద్విజకులక్షోభకరతయు విషము లోన
నణఁగుటయు నిశాచరతయు నరసినయెడ
సోమకాసురునకుఁ బూర్ణసోమ! నీకు
భేద మేమియుఁ గనరాదు పృథివిలోన. ౧౨౦

ఉ॥ తమ్ముల మోసపుచ్చుటయుఁ గంద్రికి భంగముఁ గూర్చు టంతె కా
కమ్మకడ న్మహాకుటిలతాంచితవృత్తి మెలంగు టింద్రుభా
గమ్మున శోభనాద్రిపయి గాఢముగా ననురక్తి నుంటనై
జమ్ములు నీ కటంచుభువిఁ జాటెద సోమ! నిశాచరాధమా. ౧౨౧

మ॥ నిలు వెల్ల న్విష మంతరంగమున నిండె న్నీకు మాలిన్య మో
తులువా! సద్ద్విజుల న్మొఱంగెదవు రా! తోడ్తోడ నీ మేను ము
క్కలుగాఁ జేసి మెసంగుఁగాత ఖగసంఘం బింక నీ వున్నభూ
తల మెల్లన్ జెడునట్లొనర్తువు దురాత్మా! సోమ! రాత్రించరా. ౧౨౨

వ॥ ఇట్లు చంద్రగుప్తుండు పూర్ణసోము నుపాలంభించి మన్మథ
తద్రథహయపరివారంబుల నానావిధంబుల నిందించుచు నున్మాదపరవశుం

డై యుండఁ జంద్రవతి యేతద్వృత్తాంతం బంతయు సఖీముఖంబున నెఱింగి జనకవ్యామోహజనకం బగు నాత్మీయసౌందర్యంబు నిందించుకొనుచు ౧౨౩

చ॥ జనకుని మోహనీరనిధిఁ జయ్యన ముంచినయట్టి ఘోరపా
పుని సుమచాపు నేపు చెడిపోయి నశింపఁగఁ జేయ మేరుచా
పునిఁ గొలువన్ సఖీనివహము ల్భజియింపఁగఁ బుష్పవాటికిం
జని నవమల్లిక ల్గొని రసాతలగంగఁ గృతావగాహ యై. ౧౨౪

క॥ పర్వతకుచయుం జెలులును, బర్వతలింగంబుకొఱకుఁ బాంచాస్త్రములౌ
సర్వశరంబుల నొసఁగ న, ఖర్వామోదంబుతోడఁ గదలిరి గుడికిన్.

గీ॥ లికుచవక్షోజ పర్వతలింగమునకుఁ
బూజ విధ్యుక్తముగఁ జేసి పూర్ణభక్తి
పారవశ్యంబుచే వీణఁ బట్టి పాడె
మోళ్లుఁ జిగిరించఁగా నల్లరాళ్లుఁ గరఁగ. ౧౨౬

కం॥ ఆగానమునకు నలరుచు, నాగాభరణుం డుమకరుణఁ బ్రసన్నుండై
నీగానమునకు మెచ్చితి, నేఁ గోరినవరము లిత్తు నీ పడుగు మనన్

గీ॥ దేవ! నేఁటికి భవదీయదివ్యరూప
మస్మదీయవీక్షణచకోరామృతాంశు
వయ్యె ధన్యుల మైతి మనంగగర్వ
హరణ మన నెంత మాకు మీ రండ యుండ. ౧౨౮

గీ॥ అనలలోచన! యుష్మదీయాంఘ్రిజలజ
దాస్యపరతంత్రలము మమ్ముఁ దా నెఱుఁగఁడె
నాజనకునకు నామీఁద నలినశరుఁడు
మోహ ముదయింపఁగాఁ జేసి మోసపుచ్చె. ౧౨౯

గీ॥ కాన మే నొల్ల నైక్యమ్ముఁ గరుణ నొసఁగి
నే నొసంగినమల్లిక ల్నీవు దాల్చి
యర్జునతఁ గాంచుట న్మల్లికార్జునాఖ్యుఁ
డవగు మన నట్లె కరుణించి భవుఁడు చెలఁగె ౧౩౦

సీ॥ అరుణుఁ డనెడి యొక్క యసురేంద్రుఁ డబ్జసంభవు గూర్చి ఘోరత
పం బొనర్చి, యనితరసులభంబు లగువరంబులఁ గొని యఖిలదేవత
ల నత్యధికదుఃఖ, ముల ముంచుచుండ నచలకుమారికఁ గూర్చియ
మృతాంధసులు గూడి యధికతపము, లాచరించిన భ్రమరాకృతితో
డ సాక్షాత్కరించి మిగులఁ గరుణ వెలయ;

తే॥ గీ॥ సభయ మిడి వారి యభిలషితానుసార
ముగ జగత్కంటకుని భీమభుజబలాఢ్యు
నరుణదనుభవుఁ దద్విగ్రహమునఁ గూల్చి
పరఁగె భ్రమరాంబికాఖ్యచేఁ బార్వతియును. ౧౩౧

గీ॥ వింటిరే? వీని నన్నిఁటి వీనులారఁ
బార్వికహిమాంశుమండలవదనులార!
పెద్దలు పురాణములు చెప్ప వినినవఱకుఁ
దెలిపితిని గుర్తు కల యంత తేటపడఁగ. ౧౩౨

చం॥ అనిన యశోధనుండు వినయాతిశయమ్మునఁ దండ్రిఁ గూర్చి యో
యనఘ! భవత్కృపారమఁ గృతార్థుల మైతిమి సంశయంబు లె
ల్ల నెడలె భాస్కరుండు సలిలప్రభుదిగ్గలరాశి సాంధ్యకృ
త్యనియతిఁ దీర్ప నేగె నన నందఱు లేచిససంభ్రమాత్ములై. ౧౩౩

మ॥ చని కుండంబును జేరి సక్రమముగా స్నానాదులం దీర్చి తె
చ్చినతీర్థంబులఁ బుష్పపత్రఫలరాశిన్ ధూపకర్పూరచం
దనతాంబూలముల న్శివుం గొలిచి నానాస్తోత్రముల్ చేయుచున్
జనసంఘంబుల దాఁటి యాలయబహిస్థానంబునందుండఁగన్. ౧౩౪

గీ॥ మల్లికార్జును సేవింప మహికి దిగిన
తారకల్వోలె దీపము ల్దనరెఁ బుడమిఁ
జోటు లేకుండుట న్మింట సురలు వెట్టి
నట్టిదీపంబు లనఁ జుక్క లమరె నపుడు. ౧౩౫

గీ॥ అచటి యాచార్యు లారాధ్యు లఖిలవేద
శాస్త్రపారంగతులుఁ గా సక్రమముగ

మంటపంబునఁ గల్యాణమహము సల్పి
రెపుడు భ్రమరాంబికామల్లికార్జునులకు. ౧౩౬

కం॥ ఆడిరి యచ్చరలేమలు, పాడిరి గంధర్వసతులు భక్తజనంబు
ల్వేఁడిరి ముక్తుల నిడఁ గొనియాడిరిసుర లెల్ల మల్లికార్జునునిఁ దగన్.

కం॥ ఆటలఁ బాటల గోటుల, నీటుల లో టుండనీక నిర్జరకాంతా
కోటులతో పాటుగ ధన, పాటలగంధులు దనిపిరి పరమేశ్వరునిన్.

గీ॥ ఈశ! నీ కింకఁగానరా దేమొ మాకుఁ
గానఁబడకుంట పడుటయే! కాక వేరె
కలదె భేదంబు సురనరకామినులకు
గాననాట్యాభినయరూపకళల నరయ. ౧౩౯

సీ॥ గుంపులు గుంపులు గూడి గురులు సెప్పువేదాంతభావము ల్వినెడివా
రు, బారులు దీరిచి ప్రజ్ఞలు గన్పడ స్వస్తులు చెప్పెడిబ్రాహ్మణులును
మధ్యవర్తుల నుంచి మహిమలు దెలియంగ, శాస్త్రార్థము ల్సల్పు
శాస్త్రవిదులుఁ, బండితపామరపారవశ్యముగఁ బురాణము ల్సెప్పుపౌ
రాణికులును;

తే॥ గీ॥ చెవులకింపుగ శివకథ ల్సెప్పుఘనులు
శంఖఘంటానినాదము ల్సలుపుజనులు
భక్తిఁగోలాటము ల్వేయుభక్తవరులు
చెప్ప నలవియె శివరాత్రి శ్రీనగమున. ౧౪౦

మ॥ శివదేవుండు సతీతనూజయుతుడై చేదోయి జోడించి శం
భువులో నుంచి నుతించు భక్తనివహంబుం జూచి శ్లాఘించు రెం
డవకైలాసమె యౌనటంచు సిరిగొండన్ సంస్తవించు న్మహో
త్సవ మీక్షించును రెప్ప వాల్చక యెయుత్సాహంబు దోరంబుగాన్

గీ॥ అన్నిరాత్రుల కధిపుఁడనగుచు నేనె
యుండ నీరాత్రి యొక్కటియును శివునకు
నగునె ప్రియ యని తామిత్రుఁడనుసరింపఁ
బట్టనో యన సంతలో వచ్చె విధుఁడు. ౧౪౧

మ॥ శివరాత్ర్యుత్సవదర్శనోత్సుకతచే శీఘ్రంబుగాఁ బద్మబాం
ధవుఁ డేతెంచెను కాని యుత్సవము సందర్శింప లేఁ డాయె వై
భవ మున్నంతనె యేమి లాభ మరయం బ్రాజ్ఞస్మృపుణ్యైకసం
భవ మా సద్ధి వృథాప్రయాసమునకు న్నిర్మగందుటే లాభమా.

మ॥ జను లెల్ల న్సమయోచితక్రియలఁ దీర్చన్నాగి రా భూసురుం
డును దన్వీమణియు న్సుమారు లోకచెట్టుం బాటగాఁ జూచి యె
ల్లనొ శిష్టు స్స్వామతస్థుఁ గాంచి తమతోడ న్సావడం బిల్చి భో
జనముం జేసి పురాణముం జదువఁగా సాఁగించి రప్పట్టునన్.

గీ॥ ఎలమిని బురాణగోష్ఠిఁ బ్రొద్దెల్లఁ బుచ్చి
సాంధ్యకృత్యంబులను దీర్చి స్వామిఁ గొలిచి
వచ్చి నిద్రించి యా తెల్లవాఱుకడను
వోయి పాతాళగంగకు మునుపటి వలె.

గీ॥ స్నానసంధ్యాదులను దీర్చి సక్రమముగఁ
దీర్థవిధిఁ బెట్టుకొని వచ్చి దేవుఁ గొలిచి
బసకుఁ జను బెంచి పన్నుండి బ్రాహ్మణుండు
భావిపర్వతవిరహదుర్భరత కోడి.

సీ॥ కన్ను మూయును నిప్పుఁ గలవరపడి లేచు మల్లికార్జునదేవు మది
దలంచుఁ, దోడితైర్థికులను గూడి వెంటనె యేగ వలసివచ్చె నటంచు
వగచుచుండు, నాయట్టిజనునకీ నాల్గురోజుల కింత, నగమును విడు
టన్న వగ జనించె, వాసంబుగా నున్న వారణాసిని వీడి వాతాపిహరుఁ
డెంత వగచె నొక్కొ.
తే॥ గీ॥ యనుచుఁ దా నల్లె చింతించు నగముఁ గాంచుఁ
గన్నుల న్నించు నశ్రువు ల్లగ్నములగర్భుఁ
డెంత గావించె న"న్నంచు నెదఁ గణించుఁ
గన్నె నింట నుంచితి నంచుఁ గలవరించు. ౧౪౭

క॥ ఈలాగునఁ జింతించెడి, చో "బెండుచనుఁడి" యనియెడిచొప్పునఁ గూసెం
గాబజ్ఞపత్రరథములు, గోలాహాల మమరఁ దైర్థికులుజని రెలమిన్

మ॥ శివదేవుండును వారలం గలసి యీ శ్రీశైలమం దుండువై
భవ మే భంగిలభించు నోక్కొ యనుచుం బాలాసహాయస్థితిన్
భవబంధంబు వదల్చుకొంటి మనుచున్ బాలం బ్రశంసింపుచున్
భవుఁ డత్తల్లులసంస్థుఁగొల్చుకొనుచున్ భార్యాసుతో పేతుఁడై.

కం॥ చనిచని భోగేశ్వరపుర, మునసుఖముగఁ జేరి పుత్రి భోగవిభున క
ర్చనఁ జేయుచునున్న దియని, వినిసంతోషించు చుఁజనె వేగృహమునకున్

కం॥ శ్రీమద్భ్రమరాంబాహ్వా, త్రీమాక్రీడా సుపర్వసింధ్వాపీడా
సోమకలాచూడామా,యామంజుభుజంగ! మల్లికార్జునలింగా. ౧౫౧

కం॥ దారాలింగయ్యార్యకు, మారశ్రీసూర్యచంద్రమానసవిలస
త్సారసభృంగ! యఘాద్రిశ, తారా!శ్రీశైలమల్లికార్జునలింగా. ౧౫౨

గీ॥ కష్టపడి పెంచుకొనిన నాకవనకన్య
నీకు దారవోసితి నయ్య! నెనరుతోడ
నేలుకొను మతిసుకుమారి యెప్పుడుఁ గష్ట
పెట్టకము మమ్ము సంతోషపెట్టు మయ్య. ౧౫౩

కం॥ దీనిం జదివిన వినిన మ, హానరులకునిహముఁబరము నపవర్గము గౌ
రీనాథుఁ డొసఁగుసకలాంహోనాశనమిట్టిచరితముండు నెయెందున్.

సీ॥ హారితగోత్రోద్భవుండైన మల్లమపల్లి యతుయగురునకునగ్రిమాత్మ
జుఁడు గణార్చావ్రతస్థుఁడు సాధు వౌ వీరమల్ల యాఖ్యారాధ్య
తల్లజునకు, భ్రమరాంబకుం దనూభవుఁడ విద్వత్సింహుఁ
డౌ రామలింగయ కవరజుండ,మల్లికార్జునుఁడ శ్రీమల్లి
కార్జునకృపాలేశజకవనప్రవేశుఁడ నగు; తే॥గీ॥ నా.
దు భోగేశమాహాత్మ్యనామకకృతి, యందుసం
జతుర్థాశ్వాస మైననిదియు, ముగిసెనాచం
ద్రతారకముగఁ దనర్చు, నట్లుచేయుఁతేఁ
దీనిఁ జంద్రార్థమౌళి. శ్రీ. శ్రీ.
శ్రీ. శ్రీ. శ్రీ.



# భోగేశ్వరమాహాత్మ్యము.

పంచమాశ్వాసము.



క॥ శ్రీగిరికన్యాపుణ్య, ప్రాగల్భ్యఫలాయితాత్మ! పరమాత్మ! యురో,
భోగాలంకారీకృతభోగీశ! దయానివేశ! భోగేశవిభూ! ౧

గీ॥ అవధరింపుము సర్వజ్ఞ! యఖిలరూప!
విన్నవించెద నాకు నీపేర్మివలనఁ
దోఁచినట్టులుగాఁ గొడగూచికథను
శ్రీబసవపురాణాబ్ధిలోఁ జెలఁగుసుధను. ౨

చం॥ పురి గొడగూచి భోగవిభుపూజ యథావిధి నాచరించి శ
ర్కరయును బాలు బండ్లు గరకంఠున కర్పణఁజేసి యర్చనా
పరికరము ల్వహించి చనుపట్టునఁ దండ్రిని దల్లి నన్నలం
దెరువున దూరమందుఁ గని తీవ్రగతిం జని యింటి కాద్యతిన్. ౩

మ॥ పరమామోదముతోఁ బయోభరితకుంభమ్ము ల్వడిం దెచ్చిచ
త్వరమం దుంచి వితర్దులందుఁ జిరిచాప ల్వైచి మే ల్వావన
ల్వరుసం బెట్టి యెదుర్కొనం బురజనవ్రాతంబుతోఁ స్వాగతో
త్తరము ల్చెప్పుచు వచ్చి బాలఁ గని మోదం బొప్ప వా రర్మిలిన్.

కం॥ ఎన్నియొ యుగములు జనిన, ట్లున్నదినినుఁగన్నులారనొకపరికని యే
కన్నియల గాంచినను నినుఁ, గన్నట్టిసుఖంబు లేదుగా మాతల్లీ. ౫

కం॥ అమ్మా మావ్రత మీవె క, దమ్మా చెల్లించి మాకునపవర్గమ్ము
న్గామ్మాయనిమోఁసగితివిటు,రమ్మామాముద్దుగుమ్మ! రతనపుబొమ్మా!

కం॥ అమ్మా యీపటమునఁ బీ
ఠమ్మునఁ జెలిఁ గూడిచెంగటం దేవసమూ
హమ్ములు గొలువగ సుతునం
కమ్మున నిడి కూరుచున్న గరగళుఁ గనుమీ. ౭

కం॥ అమ్మరొ యిమ్మదవృషతుర
గమ్మును రహిమీర నెక్కి కడు వేడుక వే

గమ్మునఁజను శంకరువిభ
వమ్మును గనుఁగొనుము కొనుము పట మచ్చెరువౌ.

కం॥ బొమ్మలను దెచ్చి యిచ్చెద, మెమ్మెయి భోగేశుసేవ నేమఱక మదీ
యమ్మగునతిఁజెల్లించెదొ,యమ్మా!యనసొప్పుకొంటివట్లొనరిఁచితే,

చం॥ అని శివదేవుఁ డాడుచు గృహాంగణమందునబాల తెచ్చి యుం
చినకలశంబులం గల సుశీతలవారిఁ గరాంఘ్రివక్త్రలో
చనమును జక్కఁగాఁ గడిగి చాపలపైఁ దనుజాసమేతుఁడై
తనుజులు వీవన ల్విసరఁ దాఁ బురవాసులతోడ నుండఁగన్. ౧౦

గీ॥ సర్వమంగళయునుదనుజాతఁ గనులఁ
గఱవు దీఱంగఁ గాంచుచుఁ గాళ్లు గడిగి
కొనుచు భవనంబులోనికిం జనియెఁ గన్య
తండ్రి కిట్లనఁ దొడఁగె జింతం గలంగి, ౧౧

శా॥ అయ్యా! నన్నొకదాని నింట నిడి యాత్రార్థంబుగా నేగి మీ
రయ్యైతీర్థములందు గ్రుంకు లిడి యార్యానాథు సేవించి నా
కియ్యం దెచ్చినబొమ్మలా యివి? యహా! యే నెంతనిర్భాగ్యన
క్షయ్యానందసుఖావహంబయిన శ్రీశైలంబు వో నోడితిన్. ౧౨

శా॥ ఏ నెరితిఁ దరింతు శ్రీగిరిని నే నేభంగిదర్శింతు నీ
యే నేలాగున మల్లికార్జునవిభున్ వీక్షింతు నే నింక నె
వ్వానిం దోడ్కొని పోవుదాన నకటా! వాత్సల్య మిట్లాయెనే?
హా! నాతండ్రి! యదృష్టహీన నగు నా కాభాగ్య మెట్లబ్బెడిన్. ౧౩

శా॥ మీకా! సేవఁజేర్పఁ జాలను గదా! మీతోడ భాషింపఁగా
నాకా! శక్తియుఁ జాలదాయెను గదా! నావల్ల మీ కింకఁ జిం
తాకంతైనను గార్య ముండదని కాదా! నన్ను రానీక మీ
రే కైవల్యము మూటఁగట్టుకొని రానే వచ్చినా రక్కటా. ౧౪

శా॥ అయ్యో! తియ్యనిమాటల న్నుడివి న న్నన్యాయముం జేసి మీ
రెయ్యం బంతయు నన్నలం దిడి దయానిస్వాత్మ భోగేశ్వరుం
గొయ్య న్నా మెడఁ గట్టి యేగితిరి మీ కోర్కె ల్ఫలించెం గదా!
కుయ్యాలింపక నాకు నాతఁ డిడుచిక్కు ల్సెప్పఁగా నేటికిన్. ౧౫

కం॥ ఈలాగున నాకన్నియు, జాలిం బుట్టించు నుడుల సర్వజనములం
దూలం జేయుచు నుండం, గాలములైనుఘలుదండ్రిఁగరముగలంచెన్

మ॥ కిటికీరెక్కలచాటున న్నిలచి యాక్షించం దనూజాతన
క్కటికింపన్నుఁడు లాలకించి నగచుం గర్జంబులంజూచు ము
న్పటియ ట్లన్నియు నుంటకు న్మిగుల నాసందించు లోఁ బేర్మిమి
క్కుటమై తన్ను మునుంగ జేయఁగ నిజాగారంబునం దల్లియున్.

కం॥ శివదేవుఁడు తనసుత భో
గవిభుని గొయ్యా యని నుడువఁగాఁ గసలి తనూ
భవఁ గనుఁగొని యిట్లను భో,
గవిభునిఁ గొయ్యాయనిపాతకముఁ గైకొంటే?

మ॥ యముఁ దండించి మృకండసూనునకు దీర్ఘాయుష్య మీలేదె? లో
కములం గాల్చుహాలాహలమ్ము నొకగుక్కం బీల్చి రక్షింప లే
దె? మహాదేవుఁడు గొల్చువారలకుఁ దానే భృత్యుఁ డౌచుండు న
ట్టి మహాత్మున్ గుడిగొయ్యటంటి వికఁ బట్టే? వేరె యేమున్నదే.

మ॥ నవపంకేజ దళాయతాక్షి! వినుమా నా మాట శ్రీభూధరేం
ద్రవఖండాభరణుం డొకండు మన యీ దైవంబు వేరొండె గో
లవు ఘోరాటవిలో భయంపడుదు వేలా నీకు నాయాసమీ
శివు భోగేశు భజింపు మన్నపుడు నీశీర్షంబు నూఁగింపవే. ౨౦

మ॥ చనునే? మిమ్మపు డీగతిం బెతల ముంచ న్నీకు నంభోరుహా
నన! నీయం దొకయీసునుం గలదె? యన్యాయంబుగా మమ్ముఁ జే
సినఁ బోసిమ్ము శివుంగృపాసలిలరాశిన్ నింక గా వించినా
వని చిత్తంబు గలంగుచుండె మెయి యత్యంతంబు గంపించెడిన్ ౨౧

మ॥ శివుఁ దూషించిన దక్షుఁడంతటిమహాశిష్టుండు కీడందెఁ గే
శవుఁడే యెక్కు డటన్న వ్యాసుఁడు భుజాస్తంభంబునం దూలె మృ
త్యువు లోనయ్యె యముండు దన్నుఁ దినెఁ గర్వోత్కర్షులై దారుకా
టవిమౌనీంద్రులు మోసపోయి రనుఘంటాధ్వాన మాలింపవే.

మ॥ కని కష్టించి కరంబులారఁ బెనుపంగాఁ బెద్దవై మద్వ్రతం
బును గాపాడుట యబ్బురంబె? పుడమి న్పుత్రీమణు ల్లేరె? తం

డ్రిని దైవంబును దూలనాడుదురె? నాని బోలవా? నీవు నీ
మన సెట్లట్లు వచించి పాపముల సంపాదింప సాగించితే. ౨౩

శా॥ శ్రీశైలేశు భజింప నైతి ననుచుం జింతింపఁగావచ్చు భో
గేశుం దూఱెదె దూఱనచ్చునె యతం డేచిక్కులం బెట్టు నో
సీ! శాబా సిది సమ్మనచ్చునటె ఛీ! ఛీ! నీకు నే మున్ను భో
గేశుం బెద్దల దూఱఁగూడ దనికాదే? చెప్పి వేసారితిన్. ౨౪

గీ॥ చిన్నతన మాటచే మంచిచెడ్డ లిట్టి
వనుచు నెఱుఁగమి నిట్లంటి వనుచుఁ గన్య
వనుచుఁ బ్రథమాపరాధం బటంచు మాది
కూడ లోపమె యని యొకకొంచె మరసి. ౨౫

గీ॥ కరుణచే నిప్డు నే నిన్నుఁ గాచినాఁడఁ
గన్నరో! యింక నిటుమీఁదఁ గానను జుమీ
కాన శివు దూఱకుండ జాగ్రత్త తోడ
మెలఁగవలె నట్లు మెలఁగిన మేలు నీకు. ౨౬

మ॥ అనిన న్గుండెలు జల్లన న్వని విచారాక్రాంత యై గద్గద
ధ్వనితోఁ గన్నుల నీరు గ్రమ్మ నిటుల న్వాక్రుచ్చు నాతండ్రి! కా
చిన శిక్షించిన నీవె కాదె? యకటా! శ్రీశైలనాథుం భజిం
పని దుఃఖంబున మే నెఱుంగక వృథాపాపంబుఁ జేకొంటినే, ౨౭

మ॥ కరుణాంభోనిధి! కన్నతండ్రి! గగుణ న్గాపాడితే? నన్ను శం
కరునిం దండ్రిని దూఱి పాపముల వీఁకం దెచ్చుకొ న్నట్టిదు
శ్చరిత న్మ్వాభర మైనదాని దురదృష్ట స్త్రీధరిత్రీధరే
శ్వరు దర్శింపనిపాపురాల నహహా! వాత్సల్య మా నింతయున్.

సీ॥ ఇట్టి వాత్సల్య మున్నట్టు లెఱుఁగలేక
మీకుఁ గోపంబు దెప్పించుమిగులుమాట
లాడితిని దప్పు సైరించి యయ్యా! నాదు
మనవి యున్నది వినుఁ డింక వినతు లిడుదు. ౨౯

గీ॥ మీరు వెడలినమరునాఁడె మేరుచాపుఁ
డర్ధరాత్రంబువఱకు న న్నన్నపాన

ములను గొనసీక తాఁ బాలుపుచ్చుకొనక
యఖిలకష్టంబు లిడెనుండి యయ్యగారు! ౩౦
గీ॥ ఎట్టకేలకు నాకుఁ గన్పట్టి తుదకుఁ
బాలుఁ బం డ్లారగించెఁ గోపంబు వీడి
నాఁడు నిక్క లింతవఱకు నన్యాయ మేల
నద్ది చేసయ్య? మీ యనుగ్రహమునవలన. ౩౧
గీ॥ మీరు చెప్పినమాటలు మీఱకుండ
భోగనాథునిఁ దగురీతిఁ బూజఁ జేసి
యొప్పగించితి నా తల నున్న బరువు
దీక్షఁ గాని మోక్షంబు సాధింప నైతి.
గీ॥ ఎన్ని జన్మంబులం దెంత లేసిపున్న
ములను జేసినవారికో ముక్తిసాధ
నంబు(శ్రీశైలసందర్శనంబు తండ్రి)!
యట్టివిభవంబునకు నోచనైతి నకట. ౩౩
క॥ అని యీగతి నాకన్నియ, తనతండ్రికిఁ దగినరీతిఁ దనవృత్తాంతం
బునుపినుపించినవినియతఁడనెంగూఁతుంగూర్చియిట్టులాశ్చర్యముతోఁ
శా॥ ఏమేమీ! మనభోగదేవుఁ డెవు డే మేరీతిఁ బూజించినం
దా మా కెప్పుడుఁ గానరాఁడు తనుజాతా! నీకుఁ గాన్పించునా?
ప్రేమ న్నాలను బండ్ల శర్కర నయారే! నిత్యము న్నోలునా?
నీ మాట ల్వినిన న్మహాద్భుతము లోనీ రేజప త్రేక్షణా! ౩౪
వ॥ అని యిట్టు లాశ్చర్యపడుచు నాత్మగతంబుగఁ బఱొంతరం
బవలంబించి కొంతవిచారించి మఱియు నిట్టు లనియె. ౩౫
గీ॥ ఐన ముగ్ధవు నీ మాట లన్నృతము లనఁ
జాల నీయెడఁ బేర్మిచే బాలచంద్ర
మౌళి ప్రత్యక్షమై పాలు బండ్లుపుచ్చు
కొనుచునుండును గాబోలు దినదినంబు. ౩౬
మ॥ అహాహా! యెంతటిపున్నె మోబుఱుత! నీ కర్థంగుచూడుం డను
గ్రహ మొప్పం గననౌచు నీ వొసఁగుదుగ్ధంబు ల్బలౌఘుంబు న

స్వాహము న్నాపడుచుండు నంటివి బళీ! యానందమే మాకు న
మ్మహనీయుం గనుపింపఁజేసి తరియింపం జేయు మిమ్మయ్యెడన్.
గీ॥ అనినఁ దండ్రికి గొడగూచి యనియె మీకుఁ
గానఁబడుచుండు ననుకొంటిఁ గానఁబడఁడె
భోగనాథుఁడు నా కైన మొదటినాఁడె
కానఁబడెఁ బ్రతిదినమును గానరాఁడు. ౩౯
గీ॥ ఐన నైవేద్య మనుదిన మారగించు
నదియు నోరు లున్నఁగొనను జుమ్మనియె మున్నె
అట్టివాఁ డె ట్టు లగుపడు నయ్య! మీకు
నెట్లు గన్పడఁ జేయుదు నేమి సేతు. ౪౦
వ॥ అనిన విని నిరుత్సాహుండై శివదేవుండు సాశ్చర్యానుమా
నమానసుండై యాత్మగతంబుగ నిట్లని చింతింపం దొడంగె. ౪౧
మ॥ అహహా! యెట్టివిచిత్ర మీ చిఱుతకా? యంభోజనాభాజదు
ర్గ్రహపాదాంబురుహోత్తమాంగుఁ డగు నా కంఠేకళంకుం డను
గ్రహ మొప్పం గననోట కానసయినం గానిమ్ము దివ్యాసి ప్ర
త్యహ మీపాలను బండ్ల సాపడుట యత్యాశ్చర్యముం గూర్చెడిన్.
మ॥ ఎవఁడో భోగవిభుండ నే ననుచు నీయేణాక్షికిం బొంకి కై
తవవృత్తిం ఫలదుగ్ధము ల్గొనుచు నిత్యం బుండెఁ గాఁబోలు నెం
త విపర్యాసము సంభవించె సుత ముగ్ధం గేహమధ్యంబునం
దవరోధించి యొకర్తునుంచి చనుటన్ హా? యేమిదా రియ్యెడన్. ౪౩
గీ॥ వ్రతము చెడిపోవ నెవ్వఁడో కితవుఁ డిట్లు
మోస మొనరించె నీబాల ముద్దరాలు
గపట మెట్టిదో యెఱుఁగదు కాక యున్న
నారగించునె పాలుఁ బం డ్లభవుఁ డెంను. ౪౪
మ॥ వ్రతభంగం బొనరించి రేని ఖలులం వజ్రింబుచే నద్రిలం
శతమన్యుండుబలె న్నిశాసి నచలేడ్జాజాని కర్పించి యా
ధృతి మన్మార్గము నట్లె చేసి శివు సంతృప్తాత్ముఁ గావించి శా
శ్వత మహామోక్షముఁ గాంతు నంచు మునుబాసంజేసినా నిందుకా.

కం॥ కాంభోపుకార్యములకుం, దాంబూర్వమె కారణముల దైవమెకూర్చెన్
హా! బాల నిట్లుచేయనె, కాంభోలును నాకుఁ బ్రతినఁ గల్పనచేసెన్.

గీ॥ కడపటిసుత మోక్షమునకుఁ గారణ మగు
ననుచుఁ జెప్పెనె కాని యి ట్లగునటంచుఁ
జెప్పినను ముని తత్త్వంబె చెప్పు మనమె
అట్టు లేటికి నగు నిది యిట్టు లుండ. ౮౭

గీ॥ అస్థిరం బీ శరీరంబు సుస్థిరంబు
గీర్తికాయంబు దాని నంగీకరింతుఁ
దుచ్ఛ మగుదీనిఁ బ్రతిన కైతోఁసి కాని
కన్నియను జంప నాడునే కరము లకట. ౮౮

గీ॥ ఇంతవఱ కిన్ని వ్రతముల నెంత కష్ట
పడి యొనర్చుచు నుంటి మపత్యమునకు
నకట యందును గడుపేర్మి కాస్పదంబు
కన్నెమిన్నను బరిమార్ప గడఁగవలసె. ౮౯

కం॥ ఏటికి నా కీదుఃఖం, బేటికి నా కిట్టిచిక్కు లేటి కపత్యం
బేటికి సతినుడి విని ముని, మాటను విననైతి హా! ప్రమాదమువచ్చెన్.

గీ॥ ఏమిసేయుదు నిట్లయ్యె నీశ్వరాజ్ఞ
కన్నెరో! నీకుఁ దండ్రిని గాను యముఁడఁ
బ్రాణములఁ దీయవచ్చినవాఁడ నకట!
దైవమా? యెంతచేసితే దయఁదొఱంగి. ౯౧

వ॥ అని బహుప్రకారంబులం జింతించి గొడగూచిం జూచి వ్రతభంగకారణం బయ్యె ననుభావంబునం బొడమిన కోపంబుచే వాత్సల్యంబు వోనాడి, ప్రతిజ్ఞానిర్వహణదృఢీకృతనిశ్చయుం డై ప్రకాశంబుగాఁ గుమారికి నిట్టు లనియె. ౯౨

గీ॥ భోగవిభునకు భక్తిచేఁ బూజఁ జేసి
పాలఁ బండ్ల నివేదించి భవనమునకుఁ
దెచ్చికొని ప్రసాదం బని తిను టెఱుఁగవె
మోసపోయితి వయ్యయో! మూఢురాల. ౯౩

గీ॥ పద్మనాభాదులకు నైనఁ బట్టువడని
శివుఁడు ప్రత్యక్ష మగునటే? చిఱుత! నీకు
నైనఁ బాలు పండ్లనుదినం బాఱగించు
టదియు నోరు లున్న వీలుకా దనుటఁ జూడ. ౫౪

మ॥ ఖలుఁ డెవ్వాఁడో మొఱంగి నీ విడినదుగ్ధంబు ల్ఫలౌఘంబు ని
చ్చలుఁ గాఁజేయుట తోఁచు నా నిజము నిస్సందేహ మీ విట్లుమా
యలకుం లోఁబడి కొంపఁదీయు దనుకో నైతి స్వప్రితం బేటిలోఁ
గలసె న్నాకుఁజనించెఁజిత్తముసదుఃఖంబాగ్రహంబొక్కఁటన్. ౫౫

మ॥ వ్రతమున్ బాడొనరించి స్వచ్ఛ మగు మా వంశంబు మాయంగఁ జే
సితి వీ వెంత యభాగ్య వైతివె? పిశాచీ! తెల్పవే మాయ నే
కితవుం డిట్లు మొఱంగెఁ జూపు మతనిం గీనాశపూర్వాసిఁ జే
సి తల ల్ద్రుంచెద ముందు నీది పిదపం జేకత్తిచే నాదిగాన్. ౫౬

మ॥ వ్రతభంగం బొనరించి నేని ఖలుల న్వజ్రంబుచే సద్రుహం
శతమన్యుండు బలెం శితాసి నచలేద్గాజాని కర్పించి యా
దృతి మన్మార్ధము నల్లె చేసి శివు సంతృప్తాత్ముఁ గావించి శా
శ్వత మామోక్షపదంబు గాంతు నని దీక్షం బూనినా నొక్కెడన్

గీ॥ వ్రతినఁ జెల్లింపకుండుట వలనుపడదు
చిఱుత! నినుఁ జంపఁగా నాకుఁ జేయి రాదు
యేమి చేయుదు నా కిప్పు డేమి దారి
యెంత పాపంబుఁ జేసితి నేనుదొల్లి, ౫౭

వ॥ అని చింతించి మరల ధైర్యం బూతఁగొని లేచి కోపంబుతో.

మ॥ చని కన్నుంగవకెంపుపెం పడర వేశ్మంబందునం దాఁచి యుం
చినవీరేశ్వరు పెద్దకత్తియొఱ వే చేఁ దీసి సంధించి వ
చ్చెను బత్నీతనుజు ల్పరీజనములుం శీఘ్రింబుగా నడ్డమై
చని వారింపఁగ బాల బెగ్గడిలి మూర్ఛం జెంద భీమాకృతిన్. ౫౮

గీ॥ ఇట్లు వచ్చి తనుజ నీక్షించి శివదేవుఁ
డెంతవచ్చె ననుచుఁ జింత నొంది

సతియు సుతులు సుతకు శైత్యోపచారము
జేసి మూర్ఛఁదీర్పఁ జిఱుతఁ గాంచి. ౬౦

శా॥ పిల్లా! మూర్ఛ తొలంగె నేనిఁ బదమా! వే భోగదేవాలయం
బెల్లం జూతము పోతరించి కితవుం డెందేనిఁ గాన్పించఁడే
దెల్లిం జేసెద ధాత్రిఁ దచ్ఛిరముఁ గత్తిం జూడు మీ విట్లుమా
ర్చిల్లం సాగిన నూరకుండుమని పెం చీ చీ! రమ్మ్న లెమ్మంతటన్. ౬౧

క॥ అనిన విని తుల్లిపడి లేచి యశ్రుపూర్ణ
నయనయై చేతులను మోడ్చి భయముపేర్మి
మేను గజగజఁ గంపింప దీనగద్గ
దస్వరంబున నేడ్చుచుఁ దరలెఁ గన్య. ౬౨

క॥ పిల్లవెనువెంటఁ దల్లియుఁ దల్లివెంటఁ
గొమరులును గొమరులవెంట గోపలోకి
తావలోకనభీకరుం డైనయట్టి,
తండ్రి పౌరులు చుట్టి రాఁ దరలి రంత. ౬౩

సీ॥ పసిపిల్ల నొంటిగా భవనంబులో నుంచి శ్రీగిరియాత్రకు నేగ నేల,
యేగిన నే మాయె నీపిల్లతలభోగవిభుఁ గొల్చుభారంబు పెట్ట నేల,
పెట్టిన నేమి యీపిల్లమాధ్వ్యం బిట్టు లాశ్చర్యమూల మై యమర
నేల. యమరిన నే మాయె నది యథార్థంబు గాఁ దండ్రి చిత్తంబు
నఁ దలఁపరాదె;
తే॥ గీ॥ తలఁపకున్నను దనయపైఁ దగుదు ననుచుఁ
దప్పు నిడి గత్తిచేఁ దలఁ దఱుగఁ గడఁగె
జాలి రాతికిఁ బొడమెడి నేల వచ్చెఁ
గనులఁ దెలివని కూనఁ కీకష్ట మనుచు. ౬౪

శా॥ పౌరు ల్గుంపులు గూడి చెప్పుకొనుచుం బాజారులన్ రాఁ గుభృ
ద్ధీరుం డాశివదేవుఁ డుగ్రుఁ డయి కత్తిం బూని ... గేశ్వరా
గారం బుద్ధతిఁ జేరి భీకరమహాకంఠస్వరం బబ్బగం
భీరధ్వానసమంబుగా ధరణి గంపింపంగఁ దా నిట్లనున్. ౬౫

ఉ॥ మా కులదైవతంబు నియమంబుగ మే మొనరించుపూజలం
గైకొనుసట్టి మేటి శ్రితకల్పమహీజము భోగవల్లభుం
డాకరుణాసముద్రునకు నర్పణఁజేసెడిపాలుఁబండులం
జేకొని క్రొవ్వునిన్ను బలిఁ జేసెద వానికి రార దుష్టుఁడా. ౬౬
ఉ॥ ఓరిదురాత్మ! కానఁబడు మోపశువా! పసిబాల కిట్లు ని
ష్కారణ మాపద ల్గలుగఁగా నొనరించితి వోర! నీదుసం
హార మొనర్చి యీజగతి కంతకు మే లొనరింతు నీదురా
చారము గూలిపోను మముఁ జంపఁగఁ బుట్టినవాఁడవే యిలన్. ౬౭
శా॥ ఔరా! యింతదురంతనూ! చిఱుత నన్యాయంబుఁ గావించిమా
పారంపర్యమునుండి వచ్చువ్రతముం భంగించి నిత్యంబు గో
క్షీరంబుల్ ఫలము ల్దిన న్మఱఁగి యిస్సీ! యెందునున్నావురా
క్రూరా? ఛీ! యిటురార నీశిరము నీ ఘోరాసి ఖండించెదన్. ౬౮
వ॥ ఇట్లుబహుప్రకారంబుల నుచ్చైస్స్వరంబున స్వభ్రాంతివశంబు నం దోఁచుమిథ్యాకితవుం జీరుచు నాలయముఖమంటపకల్యాణ మంటప గోపురప్రాకారాదులం దెల్ల, సక్రమంబుగ నన్వేషించి యెందునుం గా నక వేసారి మగుడి యథాపూర్వంబుగ నాలయప్రవిష్టుండై మఱియు నక్కితవుం గూరిచి యిట్టు లనియె. ౬౯
గీ॥ మూర్ఖుఁడా! నీకు నింత దుర్బుద్ధి యేల
పొడమెఁ బొడమిన నేమి గస్పడ వదేల
యేల యాయాసపెట్టెద వేల చెడెద
వెందు దాఁగితివో రార యిచటి కిపుడు. ౭౦
గీ॥ చావునకు నెంతమాత్రము జంకఁబోకు
మెప్పటికి నైనఁ గల దది యిపుడ యేని
పాప మడఁగును ముక్తియుఁ బట్టువడును
గానియెడ యమునివలనఁ గలవు పాట్లు. ౭౧
కం॥ అని యిట్లు బహువిధంబుల, ఘననిర్ఘోషానుకారికంఠధ్వనిచే
వినువీధి బొబ్బటిలఁగా, ననినను గనరామి మిగులనలమటపడుచున్.
వ॥ కుమారికం గూర్చియిట్టు లనియె.

గీ॥ కన్నెరో! వింటె నే నిట్లు మన్ను మిన్ను
వగులఁ బిలిచిన విని రాఁడు వాఁడెవండొ
యైంద్రజాలికుఁ డైయుండు నతనిపాట్లు
యముఁడె నెఱవేర్చు మనకు నాయాస మేల. ౭౩

గీ॥ నీకు నాకును నూఱేండ్లు నేఁటితోడ
నిండినవి రావె మాతల్లి! నీకు నన్నుఁ
బట్టి నినుఁబట్టి నాకును బాట్లు వచ్చెఁ
గడచి బ్రతికినవారలు గలరె భువిని. ౭౪

కం॥ అన విని సుత తండ్రికి ని,ట్లనునప్పా!నాదుమాట లనృతములనిమీ
రనునమ్మక యెవఁడోఖలుఁ,డనుకొనికోపించుచుంటిరనివార్యముగాన్

కం॥ మనభోగపతియె ప్రత్యహ
మును దుగ్ధంబులను బండ్లఁ బుచ్చుకొనుచునుం
డును గాని యొరులు గార
య్యనఘుఁడు మననయనములకు నగుపడ ననియెన్. ౭౬

గీ॥ ఐన మీకు నమ్మిక లేదు కాన నేనుఁ
గూడ భోగేశుఁ గూర్చి కుయ్యి వెడుదుఁ
గరుణఁ గన్పడినను మేలె కాకయున్నఁ
గలదు మన కష్టె మీచేతికత్తి వేటు. ౭౭

వ॥ అని ముకుళితకరకమలయై గొడగూచి భోగేశుం గూరిచి యిట్లనియె. ౭౮

మ॥ పసిదాని న్నను నీకుఁ గా విడిచి సర్వక్షేత్రయాత్రాస్థల
ప్రసవైకప్రతిబద్ధకంకణము శ్రీగ్రావంబు సేవించిన
చ్చి సమాచారము లాకళించి పిత మీఁక్షీరానుభూతిస్థితిన్
విసుమాసం బిది విశ్వసింప ననియెన్ వేవేగఁ గాన్పింపవే. ౭౯

మ॥ అసిధారావ్రతి సర్వధర్మవిదుఁ డత్యంతానుకంపుండు దు
ర్వ్యసనాస్పృశ్యుఁడు యుష్మదంఘ్రికమలవ్యాసంగవిద్మన్మనో
భసలుం డీ యనఘుండు మాజనకుఁ డో స్వామీ! కటాక్షించి నీ
యసమానం బగురూపుచే నితని కీ వ్యామోహముం దీర్పవే. ౮౦

శా॥ ఈవే దిక్కుఁ గమాకు వేరెవరు లేరెచ్చోట గాలించినన్
దేవా! నే గనుపించి మాజనకు సందేహంబు వోఁగొట్టి మ
మ్మోమవేళన్ బ్రతికింపవే? కరుణఁ గాదేనిం దదీయాసిచేఁ
జావే తప్ప మఱేమి యుండదు సుమీ! సర్వజ్ఞ! రక్షింపవే. ౮౧
శా॥ దేవా! భోగవిభూ! నిరంతరము భక్తిన్నిన్నె సేవించు మ
మ్మోవే ప్రోవనిపక్షమం దితరు లింకెవ్వారు రక్షింతు ర
య్యా? వాత్సల్యము పేర్మి నీవె కద? సన్నానాఁడు గాపాడినా
హా వాత్సల్యమె చూపి మాకిపుడు నేత్రానందముం గూర్పవే. ౮౨
కం॥ అని యిట్లుబహువిధంబుల, వినయంబున నెంత సేపు వేఁడుకొనుచునుం
డినఁ గాని భోగనాథుఁడు, గనరామిని దండ్రి కన్యకకు నిట్లనియెన్.
శా॥ చాలుంజాలును గట్టిపెట్టు మిఁక నీ జాల్మత్వ మోబాల! కా
కోలగ్రీవుఁడు గానుపించునఁటె నీకు న్వ్యర్థయే గాని యీ
కాలక్షేపము నే సహింప నని వే ఖడ్గంబుఁ జేనెత్తి, యా
కాలుండో యనఁ బిల్లపైకి నుఱుకంగా నంతలో బాలయున్. ౮౪

స్రగ్ధర.

హా లింగా లింగ యంచుం హాళహాళి మెయి నత్యంతభీచేత లింగం
బాలింగింపంగ లింగం బపుడు పెటపెటా యంచు నిర్భిన్న మైన
ట్లాలింపన్ రా దురీక్ష్యం బయి దురధిగమం బైన తేజంబు దానై
బాలా! నే నుంటి నేలా భయ మనిదయచే వక్షముం జేర్చుకొంచున్.
మ॥ కరిరాడ్వక్త్రునితో గిరీంద్రసుతతో గంధేభచర్మంబుతోఁ
గరుణాపూర్ణకటాక్షవీక్షణముతో గంగాకపర్దంబుతో
నురగాలంకృతదివ్యవిగ్రహముతో నుద్వేద్వతంసంబుతోఁ
దురగీభూతవృషంబుతో మృగముతోఁ దోడ్తోడఁ గాన్పించినన్. ౮౬

లయగ్రాహి.

అంద ఱరుదెంది యరవిందశరకోటిశతసుందరుని జందురు సిగం
దురుము జేజేఁ, సందరికి డెందముల యందుఁ జెలువొందుగను
నిం దనివినొందని కనుందొవలఁగంచున్, గెందలిరులే యివి య
నం దగినహస్తముల నందముగ మోడ్చి యభివందనములం చీ,

యిందుము ఖవల్ల మన మందఱము సద్గతిని జెందితి మటంచు ముద
మంది నిలువంగన్. ౮౭

### మ ణి గ ణ ని క ర ము .

మును పాకపతి శౌనకముని కొమరుని ద
క్కినమునఁ గలదొర గెడపఁగడఁగినం
గని కనలుచుఁ గనికరమున నతని
న్మనిచినదొర యనె మహీసురమణితో. ౮౮

గీ॥ లేక లేక గలిగె నీకు సంతానంబు
గడకు దానఁ గలిగెఁ గన్నె దాని
గారవమునఁ బెనిచి కత్తిచే నాకయి
దునిమె దేల బేర్మి ద్రోసి యహహా! ౮౯

చం॥ నలువకు నల్లనయ్యకుఁ గనంబడరానటువంటి నన్ను ని
శ్చలమగుభక్తి బాలకునిచాడ్పునఁ బాలకు లోనొనర్చె నీ
కులమణి నీతనూజ గొడగూచి మదర్థము దానిఁ గత్తిచేఁ
దలఁదరుగం దలంపడితె తావకసాహస మింత యొప్పునే. ౯౦

కం॥ అచ్చెఱు వగు నీభక్తికి మెచ్చితి శివదేవ నిన్ను మించినవా రీ
దచ్చికడల లేరిపుడే, నిచ్చెద వర మీవు వేఁడు మేదే ననినన్. ౯౧

కం॥ వినిమనమున నిముడని ముద,మునఁ బరవశుఁడగుచు మేనుపొంగ గభోగే
శుని నిట్లని సంస్తుతిచే, సెను శివదేవుండు భక్తిచే సాంజలియై. ౯౨

### ద ం డ క ము .

శ్రీశైలరాజన్యకన్యాముఖాంభోరుహేందిందిరా ఇందిరానాథవాణీ
ధవాశ్రాంతసంస్తూయమానాసమానప్రభావాప్రభావాహినీ ధిక్కృతస్వ
ర్గగంగా! ధృతస్వర్గగంగా! కరాంచత్కురంగా! వృషోద్యత్తురంగా! భుజంగేం
ద్రభూషా! మునీంద్రాఘపోషా! జగన్మోహవేషా! ధరిత్రీశతాంగా! రవిగ్లా
రథాంగా! సరస్వన్నిషంగా! రమానాథరోపా! సువర్ణాద్రిచాపా! యగమ్య

స్వాహాషా నినుం గొల్వఁగా సంస్తవింపంగ భావింప వాగీశభోగీశులుం జాల రో తండ్రి! నేనెంతవాఁడప్రభూ! సర్వలోకేశ! భోగేశ! నీభక్తుఁడన్ స్వార్థుఁడ న్భక్తిచే నిన్ను మెప్పించి నీచేత దుగ్ధంబులం శర్కరన్ బండులం బ్రత్యహం బాఱఁగింపంబడం జేయుచున్నట్టి ఘన్యాత్మిక స్వన్యకన్మోహవిభ్రాంతిచేఁ గత్తి చేఁ ద్రుంపఁగా సిద్ధపడ్డట్టి పాపాత్ముఁడన్ దండ్యుఁడన్నేను నేరీతిగా నీదయాపాత్రతం జెందినానో వరం బిచ్చెద న్వేఁడు మన్నావు నాకింతకన్న న్మహావైభవం బున్నదే? యైహికం బేని నాముష్మికం బేనియు న్నశ్వరంబుల్గదా! వాని నే నొల్ల మోక్షంబ చేకూర్చు నీ మేము మాభృత్యులుం శిష్యులుం బంధులు న్మిత్రులుం బుత్రులుం గోవులుం గూడ మత్సుత్రితో పాటు కైవల్యముం జెందఁగా వే కటాక్షింపవే శంకరా! పాపనాశంకరా! ౯౩

కం॥ అని వేఁడిన భోగేశుఁడు, విని యతని న్మెచ్చుకొనుచు వేవారికిము
క్తిని నిడి యంతర్హితుఁడౌ, య్యెయుభోగేశా! యతండవి వెకద! విభూ.

శా॥ దారావంశజసూర్యచంద్రహృదయోద్యద్భర్మసౌధాంతరా
ధారా! మానిమనస్సరోవిరహణోత్కంఠావదాతచ్ఛదా!
పారావారనిషంగ తుంగవృషరాడ్వాహా! గజేంద్రారిసం
హారా! హీరపటీరహారశరనీహారాభ! భోగేశ్వరా! ౯౪

తే॥ గీ॥ కష్టపడి పెంచుకొనిననాకవనకన్య
నీకు దారవోసితినయ్య నెనరుతోడ
నేలుకొను మతిసుకుమారి యెపుడు గష్ట
పెట్టకుము నమ్మ సంతోషపెట్టుమయ్య. ౯౫

గీ॥ భక్తి గొడగూచికథ సత్ప్రబంధముగను
జేసి మీకు నర్పించుటచేత మాకుఁ
గూడఁ దజ్జనకాదులకు వలె ముక్తి
నిడక తప్పదు మీకుఁ గృతీశులార! ౯౬

క॥ దీనింజదివినవినిన మ, హానరులకునిహాముబరమునపవర్గముగౌ
రీనాథుఁడొసఁగుసకలాం,హోనాశనమిట్టిచరితముండునెయెందుఁ.
సీ॥హారితగోత్రోద్భవుం డైనమల్లమపల్లి యతుయగురునకు నగ్రిమాత్మ,
జుఁడుగణార్చావ్రతస్థుఁడు సాధు వౌవీర మల్లయాఖ్యారాధ్య
తల్లజునకు, భ్రమరాంబకుం దనూభవుఁడ విద్వత్సింహుఁ
డౌరామలింగయ కవరజుండ, మల్లి కార్జునుఁడ శ్రీమల్లి
కార్జునకృపాలేశజకవన ప్రవేశుఁడనగు; తే॥ నా
మ భోగేశమాహాత్మ్యనామకకృతి, యందునం
బంచమాశ్వాస, మైననిదియు, ముగిసె నాచం
ద్రతారకముగఁ దనర్చు, నట్లుచేయుతఁ
దీనిఁ జంద్రార్ధమౌళి॥ శ్రీ. శ్రీ.
శ్రీ. శ్రీ. శ్రీ.



# శుద్ధపత్రిక.

| పు | పద్య | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| II | 7 | మానవు | నరుఁడొక |
| VI | 27 | ఫుత్తడుబేర్తిరీ | వఁడలతురుగాతఁ. |
| 23 | 17 | సుగుణమూక్తాళి | సుగుణముక్తాళి |
| 24 | 23 | అధస్థలి | అధస్స్థలి |
| 25 | 31 | పదునిడి | పదనిడి |
| 25 | 35 | కూర్చుతన్నిచ్చలుఁ | కూర్తురెంతేనియుఁ |
| 33 | 9 | నా లేదా గా | నాఁగా లేదా |
| 33 | 12 | మహాసురా | మహీసురా |
| 45 | 92 | నాగితివా | సాగితివా |
| 45 | 94 | తుది వ॥ | అని పాములసోముంగూర్చి యిట్టులనియె |
| 47 | 112 | హృడజ్జల | హృజ్జల |
| 47 | 113 | కవనన్య | కవనకన్య |
| 52 | 24 | భావమెల్లైన | భావమల్లైన |
| 57 | 58 | శ్రిపర్వత | శ్రీపర్వత |
| 58 | 71 | పతికిఁబతిభక్తి | సతికిఁబతిభక్తి |
| 59 | 74 | సంనార | సంసార |
| 64 | 114 | శిలీమఖంబులను | శిలీముఖంబులను |
| 66 | 127 | తుది | వ॥ చంద్రవతి ముకుళితకరకమలయై పర్వతలిగమునకిట్లనియె. |
| 66 | 128 | ధన్యుల | ధన్యల |
| 69 | 146 | చనుజెంచి | చనుదెంచి |
| 75 | 37 | పాలుబండ్లు | పండ్లుబాలు |
| 76 | 45 | అచలేడాజాని | అచలేడ్జాజాని |
| 78 | 59 | వ॥ కోపంబుతో | కోపంబుతో |
| 79 | 65 | | భో |
| 80 | 66 | పాలుఁ | పాలఁ |
| 80 | 70 | దుర్[illegible]యేల | దుర్బుద్ధియేల |
| 82 | 87 | [illegible]స్తముల | హస్తముల |
| 83 | 93 | [illegible]రస్వన్నిషంగా | సరస్వన్నిషంగా |